త్వరపడండి

స్వంతం చేసుకోండి!

# శ్రీవాణి శత సంచిక ప్రత్యేక సంచిక

## ఏప్రియల్ '93 లో సుమారు 200 పేజీలతో వెలువడుతుంది.

ఈ ప్రత్యేక సంచికలో అనేకమంది ప్రముఖుల సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్య, విజ్ఞాన వ్యాసములు, కవితలు, పద్యములు, పురాణ ఇతిహాస కథలు, ప్రశ్నలు-సమాధానములు, వింతలు-విడ్డూరాలు, మీకు తెలుసా?, ఆణిముత్యాలు, నీతిసూక్తులు, ఇంకా...ఇంకా... ఎన్నో...ఎన్నో...విజ్ఞాన విశేషాలుంటాయి.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ప్రసంగాలు, సందేశాలు, ఆధ్యాత్మిక ప్రబోధలు, వారి మహిమాన్విత దివ్యశక్తిని గురించిన వ్యాసములుంటాయి.

**విడి ప్రతి : రు. 15-00**

చందాలు అమలులో ఉన్న వారికి క్రొత్త చందాదారులుగా వెంటనే చేరేవారికి పై ప్రత్యేక సంచిక పంపబడుతుంది. అదనంగా ఏమాత్రం చెల్లించనవసరంలేదు చందాలు రెన్యూవల్ చేయని వారికి, బకాయిలు ఉన్నవారికి పై ప్రత్యేక సంచిక పంపబడదు.

పారిశ్రామికవేత్తలు, వ్యాపారస్థులు తమ ప్రకటనలు (Advertisements) పంపి సహకరించ ప్రార్థన

### చందాల వివరాలు

సం. చందా : రు. 48-00

4 సం. చందా : రు. 175-00

జీవిత సభ్యత్వం : రు. 600-00

( జీవిత సభ్యుల ఫొటోలు ప్రత్యేక సంచికలో ముద్రించబడుతాయి )

పోషకులు : రు. 1116-00

1) ప్రతి నెలా శ్రీవాణి పంపటమే గాక శ్రీవాణి ముద్రించిన పుస్తకాలు కూడా ఉచితంగా పంపబడుతాయి.

1. వివేకవాణి, 2. రామాయణపాత్రలు, 3. అమృతవాణి, 4 కనీస విజ్ఞానం

పోషకులకు వెంటనే పుస్తకాలు పంపబడుతాయి.

గమనిక : చెక్కులు అంగీకరించబడవు. M O. లేక D D. ద్వారా చందాలుపంపవలెను

### ప్రకటనలు *(Advertisements)*

| | |
|---|---|
| Back Cover (4th Page) Multi Colours | Rs. 5000-00 |
| Second & Third Cover (Black & white) | Rs. 3000-00 |
| Opening page(Deluxe) | Rs. 2000-00 |
| Full page (Deluxe) | Rs. 1500-00 |
| Full page (Ordinory) | Rs. 1000-00 |
| Half page ( ,, ) | Rs 500-00 |

N. B.; Cheques & Drafts should be drawn in favour of 'SREE VANI, Monthly, Machilipatnam

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

జనవరి 1993

సంపుటి : 9

సంచిక : 1



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 4-00 |
| సంవత్సర చందా | : రు. | 48-00 |
| 4 సం॥ల చందా | : రు. | 175-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 600-00 |
| పోషకులు | : రు. | 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM


## విషయసూచిక



ముఖచిత్రం : అయ్యప్ప స్వామి

# సంబరాల సంక్రాంతి

—కొమరగిరి జయప్రద

" కోదండస్థే సవితరి
యావన్మకర సంక్రమమ్
తావద్దినేషు ప్రత్యూషే
భగవంతం జనార్దనమ్ "

పైన చెప్పిన విధముగా, ధనుర్మాస ఆరంభము నుండి, మకర సంక్రమణ ఆరంభము వరకు గల ముప్పది దినములు ప్రత్యూష కాలము భగవంతుడైన జనార్ధనుని అర్చించవలయునని అర్థము. సంవత్సరమునకు ఆయనములు రెండు. ఒకటి ఉత్తరాయణము, రెండు దక్షిణాయనము, సూర్యుడు కర్కాటక రాసిలో ప్రవేశించు కాలమున దక్షిణాయనము ప్రారంభమగును. సూర్యుడు మకర రాసిలో ప్రవేశించు కాలముననే ఉత్తరాయణము అని పేరు. దేవతలకు ఉత్తరాయణము పగలు, దక్షిణాయనము రాత్రి కాగా, మనకు ఒక సంవత్సర కాలము వారికి ఒకరోజు అవుతున్నది

భారతదేశం, అందులోనూ ఆంధ్రప్రదేశ్ వ్యవసాయం ప్రధానమైన దేశం ప్రకృతిలో మారుతున్న ఋతువులకూ వ్యవసాయానికి దగ్గర సంబంధం ఉంటుంది. సరియైన అదునులో వర్షాలు కురిసి మంచి ఫలసాయం చేతికివస్తే అంతకన్నా అదృష్టమే ముంటుంది రైతన్నకు! సంక్రాంతి పండుగకు వరి, చెరకు, లాంటి పంటలు, జొన్న, సజ్జలాంటి మెరక పంటలూ అన్నీ ఇళ్ళకుచేరి గృహాలన్నీ ధాన్యపు గాదెలతో కళకళలాడుతూ ఉంటాయి. అందరి చేతుల్లోనూ కాదో గొప్పో ధనలక్ష్మి ఉంటుంది దానితో గృహలక్ష్మికూడా ఆనందంగానే ఉంటుంది ఇలా అన్ని హంగులతో ఆనందంగా వస్తుంది సంక్రాంతి లక్ష్మి.

రంగురంగుల ముగ్గుల రంగవల్లుల తోడ
బంతి చేమంతి పువ్వుల జాలుతోడ
గుమ్మడిపూలు గుచ్చిన గొబ్బెమ్మల తోడ
కదలివచ్చెను భాగ్యాల కడలివోలె
మకర సంక్రాంతి లక్ష్మి హేమంతవీధి

సంక్రాంతి అనగానే ముగ్గులు గుర్తుకు వస్తాయి. త్రైన సంపదా ఎవరింటనుండూ దినదినము ముగ్గున్ని లోగిళ్ళనుండూ " అన్నారు. ఇది హేమంతఋతువు మంచు బాగా కురుస్తుంది అయినా మనవారుతెల్లవారుఝామునేలేచి ఎవరికివారే ప్రక్కవారికన్నా పెద్ద ముగ్గు వెయ్యాలని వేసిన ముగ్గు వెయ్యకుండా వెయ్యాలని పోటీలు పడ్తుంటారు. అదొక సరదా, అదొక ఆనందం.

ఆ ముగ్గుమీద ఆవుపేడతో గొబ్బెమ్మలు చేసి రంగు రంగు పువ్వులతో అలంకరించి పూజించి. పెడ్తారు కన్నె పిల్లలు సాయంత్రంపూట 'సందె గొబ్బెమ్మ' పెడ్తారు. ధనుర్మాసం మొదలయిన దగ్గరనుండీ అన్ని ఇళ్ళముందు సున్నం, బియ్యపుపిండి కలిపిపెట్టిన తెల్లనిముగ్గులపై రంగురంగుల పూరలతో నలంకరించిన గొబ్బిళ్ళు ప్రత్యక్షమౌతాయి. ఈ నెల మొదలునుండే ముగ్గులతోపాటు, సాతాని జియ్యరు భగవన్నామం, నెత్తిమీద తళతళ మెరిసే అక్షయపాత్రతో, ఒక చేతితో తంబుర మీటుతూ, మరొక చేతితో చిరుతలు వాయిస్తూ హరికథలను గానంచేస్తూ మెడలో బంతిపూల దండతో, మొగాన నామాలతో ప్రత్యక్షమౌతారు హరిదాసులు. 'బుడబుడల్' అంటూ బుడబుక్కలవారి దీవెనలు, గంగిరెద్దువారి మేళాలు బసవన్నల ఆటలు ఒకటేమిటి నెలంతా సందడి చేస్తూ వస్తుంది సంబరాల సంక్రాంతి. ఇది మూడు రోజుల ముచ్చటైన పండుగ.

ఈ పండుగ మొదటిరోజు భోగి, తెల్లవారుఝామున లేచి భోగిమంటలువేసి చలి కాచుకుంటారు. ప్రొద్దున్నే చిన్నపిల్లలకు తలంటి స్నానం చేయిస్తారు సాయంత్రం పిల్లలకు భోగిపండ్లు పోసి, పెద్దలకు శనగలు, పండ్లు, పిల్లలకు చెరకుముక్కలు పంచి పెడతారు. రెండవరోజు సంక్రాంతి పండుగ. ఇది చాలా ముఖ్యమయిన రోజు. పితృదినము, ఉత్తరాయణ పుణ్యకాలం ప్రవేశించే రోజుకూడా ఇదే. ఈరోజుననే పితృదేవతలకు తర్పణము వదిలి, బంగారముతో సహా గుమ్మడికాయను దానమిస్తారు. శక్తివంచన లేకుండా దానధర్మములు చేయటం ఈరోజు ప్రత్యేకత

ఉత్తరాయణ ప్రవేశమునకు ప్రాముఖ్యత చాలా ఉన్నది. అగ్ని, ప్రకాశము, పగలు, శుక్లపక్షం, ఆరు మాసాల ఉత్తరాయణం, ఈ కాలంలో మరణించే బ్రహ్మోపాసకులకు బ్రహ్మప్రాప్తి కలుగుతుందని గీత బోధిస్తున్నది.

శ్లో॥ ధూమోరాత్రి స్తథా కృష్ణః,
షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతిః
యోగీ ప్రాప్య నివర్తతే ॥

పొగ, రాత్రి, కృష్ణపక్షం, ఆరు మాసాల దక్షిణాయనంలో, మరణించే యోగులు చంద్రజ్యోతిని పొంది మరల మానవలోకంలోకి వస్తారని భగవద్గీతలో చెప్పబడింది.

ఉత్తరాయణంలో మరణించినవారు ముక్తులౌతారని, దక్షిణాయనంలో మరణించినవారికి పునర్జన్మ లభిస్తుందని అర్థం. ఉత్తరాయణం మోక్షపథ జ్యోతిర్విలసితం. దక్షిణాయనం జనన మరణాది మార్గం. తమోమయం భీష్మాచార్యులు ఉత్తరాయణం వచ్చేవరకు ఆగి మరణించటంలోని అంతరార్థం ఇదే!

మూడవరోజు కనుమ పండుగ. ఇది పశువులను పూజించే రోజు. రైతులు పశువులను శుభ్రంగా కడిగి వాటిని చక్కగా అలంకరిస్తారు. కొంతమంది పొంగలి వండి నైవేద్యం పెడతారు ఎడ్ల పందాలు, కోడి పందాలు ఒకటేమిటి! అంతా సందడే! అనంతుడై అణువణువున నిండివున్న పరమాత్మను అన్నిరూపాల లోనూ పూజించటమే మన ప్రత్యేకత. అందుకే "సర్వజీవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" అన్నారు. అలా మనవారు పండుగల పేరిట, ఆచారాల పేరిట ఒక ప్రత్యేకతను ఆపాదించారు. కనుము వెళ్ళిన మరునాడు ముక్కనుము, ఈరోజున ఆడపిల్లలకు అల్లుళ్ళకు బట్టలుపెట్టి వీడ్కోలు చెబుతారు కొన్ని ప్రాంతాలవారు. ఈ రోజునుండి సావిత్రీదేవి నోమును తొమ్మిది రోజులు నోచుకుంటారు నోములు, వ్రతాలు, దానధర్మాలు, సాటివారికి సాయపడే గుణాలు అన్నీ క్రమక్రమేణా తగ్గిపోతున్నాయి. అర్థంలేని ఆచారాలతో, కాలాన్ని వ్యర్థం చేస్తున్నారు. అర్థం తెలుసుకోకపోతే అనర్థమే వాటిల్లుతుంది. అర్థంలోనే ఉన్నది పరమార్థం. పరోపకారమే పరమార్థం. ఉపకారం ఎప్పుడైనా ఉపయోగపడుతుంది. అపకారం ఎప్పటికైనా హానిని తెచ్చిపెడుతుంది. పరోపకారం మనశ్శాంతిని యిస్తుంది. ఇదే సందేశమును మనకు పండుగలు యిస్తున్నాయి. వాటిని అనుసరించి ఆచరించడం మన కర్తవ్యం ○

**శ్రీవాణి** జీవితసభ్యులకు, చందాదారులకు, రచయితలకు, పాఠకులకు మరియు ప్రోత్సాహకులకు
మా హృదయపూర్వక నూతన సంవత్సర మరియు సంక్రాంతి శుభాకాంక్షలు

శ్లో॥ జ్ఞాతుం నశక్యంచ కిమస్తి సర్వైః
యోషిన్మనోయచ్చరితం తదీయం
కాదుస్త్వజా సర్వజనైర్దురాశా
విద్యావిహీనః పశురస్తి కోవా?

# అమృతవాణి

## కూచిభొట్ల చంద్రశేఖరశర్మ

ఒక్కొక్కవస్తువుకు ఒక్కొక్క తత్త్వంవుంటుంది. తత్త్వం అంటే దాని స్వభావం ఆయా వస్తువుల్ని పరిశీలించినప్పుడే వాటి తత్త్వం అవగాహనమౌతుంది అలాగే ప్రతి మనిషికీ ఒకవిధమైన తత్త్వముంటుంది. విభిన్న తత్త్వాలు గల జీవనమే యీ మానవ సంఘం. ఆయా వ్యక్తులతో పరిచయం కలిగి స్నేహం పెరిగిన కొద్దీ వారి తత్త్వాలు అర్థమవుతుంటాయి. ఇలా పరిచయంతో పరిశీలిస్తే ఎవరి తత్త్వమన్నా తెలుసుకో వచ్చును. కాని యెంత పరిశీలించినా అంతుపట్టని తత్త్వం కలవారుంటారట. వాళ్ళెవరు? అని యిక్కడ ప్రశ్న. దానికి స్త్రీల మనస్సే అంతుపట్టని అగాధం అని సమాధానం.

నిజమాలోచిస్తే ఏ సుభాషితం చెప్పినా యీ మాటే నొక్కి చెప్పింది. ఇది బాగా పరిశీలించినమీదట తత్త్వజ్ఞులు చేసిన నిర్ణయమేకాని మరొకటి కాదు.

స్త్రీ మనఃప్రవృత్తి పురుషప్రవృత్తికంటే చాలా భిన్నమైంది. స్త్రీకి అదొక వరమేమో తెలీదు కాని తాను మనసులో ఆలోచన ఏం చేస్తుందో అది తాను చేసిన పనియొక్క ఫలితాన్నిబట్టే చెప్పాల్సిందికాని వేరుగా వూహించటానికి వీలుకాదు. అంత లోతైనది స్త్రీ మనసు. ఎన్నో కథలు గాధలు తన కడుపులో దాచుకోగలదు సముద్రం తనలో బడబాగ్ని దాచుకున్నట్లు. ఇది స్త్రీ గతమైన ఓర్పుకు ప్రశంస.

ఎన్నో రకాల కష్టాలను నష్టాలను భరించి దుఃఖాన్ని దిగమింగి లేమిని వ్యక్తం చేయకుండా గంభీరంగా వుండే మనస్సు స్త్రీది.

భారతంలో కుంతి, ద్రౌపది లాంటివారూ, రామాయణంలోని సీత మొదలయినవారు అలాంటి గంభీర అగాధ మనస్తత్త్వం కలవారు.

అలాగే మరో ప్రశ్న ఏమంటే – ఎవ్వరూ వదలిపెట్టలేనిదొకటి వుందట ఏమిటది అని మనిషి ప్రయత్నం చేసే చెడు అలవాట్లను వదిలిపెట్టగలడు. ఒక్కొక్కడికి ఒక్కొక్కటి సాధ్యమౌతుంది ఒకడు వదిలిపెట్టలేని దుర్గుణం మరొకడు వదిలిపెట్టగలడు. కాని దురాశను మాత్రం ఎవ్వరూ వదలనేలేరట అది అంత కష్టసాధ్యమన్న మాట. దురాశ అంటేనే తెలుస్తోంది వుండకూడని చెడ్డ ఆశ అని. అలాంటప్పుడది యెంత బలమైందో చెప్పలేం. మనిషి తన శక్తిని కూడా మరచి కోరుకొనేది యీ దురాశ. అది చాలా తీవ్రమైన మనిషిని ఒకప్పుడు దానవుణ్ణిగా మారుస్తుంది కూడాను.

అలాగే నాల్గు కాళ్ళమీద నడిచే జంతువుల్ని చూచి పశువులంటున్నాంకాని అసలు సిసలైన పశువుమాత్రం విద్యావిహీనుడే అంటుందీ సూక్తి.

అయితే ఒక్క విషయం. ఈ కాలంలో చదివే రకరకాల చదువులు విద్యలు కావు. మంచి చెడుల వివేకాన్ని కలిగించే జ్ఞానమే విద్య అంటే. అలాంటి జ్ఞానం కలిగించనిది విద్య కాదన్నమాట. దీన్నిబట్టి జ్ఞానశూన్యుడు పశువని తెల్సుకోవాలి. అందుకని ఏ బాధ పడినా జ్ఞానార్జన కోసం మనిషి ప్రయత్నిస్తే పశువయ్యే ప్రమాదం తప్పుతుంది ○



# స్వామియే శరణం అయ్యప్ప

—————స్వామి సుందర చైతన్యానంద

విశ్వమందలి జలమంతయూ గంగా జలంగామారే మకర సంక్రాంతి శుభదినాన అశేష జనావళి విశేషముగా సంక్రాంతి పర్వ దినమును జరుపుకొనుచుండగా, "స్వామియే శరణం అయ్యప్ప అంటూ నల్లని దుస్తులతో, పెరిగీ పెరగనట్టున్న గడ్డంతో, నుదుటన చందనమును ధరించి ఇరుముడిని నెత్తిపై నుంచుకొని అయ్యప్ప భక్తులు స్వామి దర్శనార్థమై శబరిమలైకి పోవుచుందురు.

సత్యము అద్వైతము. అద్వైత సత్యమును చేరేందుకు మార్గములు అనేకములుండును. అలాగే ఒకే సత్యమైన భగవానుని ఉపాసనా సౌలభ్యము కొరకు అనేక రూపములు, అనేక నామములు తగిలించి 'నీ నామ రూపములకు నిత్య జయమంగళమ్' అని నమస్కరించుట సనాతన ధర్మమార్గానుయాయులకు అనుభవములోనున్న విషయమే.

అనంతరూపుడైన భగవానుని మూర్తులలో "స్వామి అయ్యప్ప" ఒక మంగళ మనోజ్ఞమూర్తియై ఉన్నది. ప్రతి సంవత్సరము లక్షలాది భక్తులు వెళ్ళి దర్శించు ఈ స్వామి అయ్యప్ప మూర్తి వైభవమును, యాత్రలోని ఆధ్యాత్మిక అవగాహనను తెలిసికొందుముగాక!

అయ్యప్ప దర్శనానికి బయలు దేరు అనుష్ఠానభక్తులు "ఇరుముడి" అనుదానిని తయారుచేసుకొని దానిని నెత్తిపై నుంచుకొని బయలుదేరుట మీరు చూచియే ఉందురు. ప్రథమ సోపానమైన ఈ "ఇరుముడి" ని గూర్చి మొదట తెలిసికొందుము.

"ఇరుముడి" అనగా రెండు ముడులు వేసియున్న మూటను తలపై నిడుకొని భక్తులు బయలుదేరుదురు. ఈ మూటలో ముందు వైపున భగవదారాధనకు సంబంధించిన వస్తువులను నింపుకొందురు. వెనుక వైపున తనకు కావలసిన ఆహార పదార్థమును నింపుకొందురు. ఈ "ఇరుముడి" ని తలపై నుంచుకొని, వెను తిరిగి చూడకుండా. ఎవరితోను పలుకకుండా ముందుకు నడిచి వెళ్ళుదురు.

భగవదర్శనార్థము బయలుదేరి వెళ్ళు భక్తుడు ఎన్నడూ వెనుదిరిగి చూడరాదు. ప్రాపంచిక విషయాలపై వెన్ను తిప్పి నడక సాగించాలి. పోయేనాడు అందరూ ఒంటరివారే. ఒకరితో ఒకరు చెప్పి వెళ్ళేదంటూ ఉండదు. ఈ కారణముగా అయ్యప్ప దర్శనార్థము వెళ్ళే అనుష్ఠాన సాధకులు వెనుదిరిగి చూడకుండా ఎవరిని పరామర్శించకుండా వెళ్ళుదురు.

భగవత్కైంకర్యమునకై ముందు వైపున ఉంచుకొనిన మూటలో నేయి నింపి మూతవేసిన నారికేళము, కర్పూరము అగరుబత్తిలాంటి పూజా ద్రవ్యములు ఉండును. వెనుక వైపున ఉన్న మూటలో తనకొరకు గాను తాను తీసుకొని వెడుచున్న ఆహార పదార్థములుండును.

ప్రతి వ్యక్తి తన జీవితములో ఆచరించిన కర్మల యొక్క ఫలితములే రాబోవు జన్మలకు జీవనమును సమకూర్చును అని తెలుపుటయే ఆహారపదార్థములను ఉంచుకొనుటలోని భావార్థము.

రెండవ మూటలో భగవత్పూజకు సంబంధించిన వస్తువులు ఉండును. నేతితో నింపిన కొబ్బరికాయ ఒకటి ఉండును. అగరుబత్తి, కర్పూరము ఇత్యాదులు ఉండును

కొబ్బరికాయకు మూడు రంధ్రములుండును. ఆ రంధ్రముల ద్వారా నేతిని కొబ్బరికాయలో నింపుదురు. నింపిన తరువాత దానిని మూతపెట్టి ఇరుముడిలో కట్టుకొందురు భగవానుని సన్నిధికి వెళ్లేంతవరకు దానిని తలపై నుండి దించరు

ప్రకృతి త్రిగుణమిశ్రితమై ఉన్నందున మనమాచరించెడి ప్రతి కర్మయును సత్వరజస్తమోగుణాత్మకమై ఉండును. కొబ్బరికాయపై నున్న మూడు రంధ్రముల ద్వారా నేతిని నింపుదురు. అనగా మనము తయారు చేసుకొను కర్మ సంచితమంతయు గుణ మిశ్రితమై ఉన్నదని భావము. ఇలా నేతిని నింపి మూతపెట్టిన పిదప దానిని మూతతో బిగించి స్వామి సన్నిధిలో తెరచి, అందులోని నేతిని స్వామికి అభిషేక మొనర్చుదురు. ఆ మిగిలిన రెండు కొబ్బరిచిప్పలను అక్కడే వెలుగుతున్న అగ్నిగుండములో పడవేయుదురు. అనగా సూక్ష్మశరీరమనెడి అంతఃకరణ భగవానునికి అభిషేక రూపమున సమర్పించబడింది స్థూల రూపమైన దేహము అగ్నిగుండానికి ,ఆహుతి ఆయినది ఎంతటి భాగ్యవంతుడైనను ప్రతి మానవుని శరీరము ఒకనాటికి శ్మశానానికి అంకితమగునదియే అని తెలుపుటయే అందులోని అంతరార్థము.

స్వామికి సంబంధించిన ఇరుముడిలోని నారికేళమునందు నెయ్యి శరీరానికి సంకేతమని, కొబ్బరిచిప్పలు స్థూల శరీరానికి సంకేతమని గ్రహించితిమి ఆ ఇరుముడిలో అగరుబత్తులు కూడా ఉండును. ఇవి మనలోని వాసనాత్రయమునకు సంకేతము. దేహ వాసన, లోకవాసన, శాస్త్రవాసన అనెడి వాసనాత్రయమును స్వామికి సమర్పించుటయే అగరుబత్తులను తీసుకొని వెళ్ళుటలోని భావము. ఇక కర్పూరము సంపూర్ణ శరణాగతిని, పూర్ణాహుతిని తెలియజేయును. కర్పూరము వెలిగిన తరువాత ఏమీ మిగలదు. 'భగవాన్! నీ ఆరాధనలో నన్ను నేను సంపూర్ణముగా సమర్పించుకొని ఏమీ మిగలకుండా ఆహుతి అగుదును గాక! ఐక్యమగుదును గాక!' అని భావించుటయే కర్పూరమును తీసుకెళ్ళుటలోని అంతర్భావము.

అయ్యప్ప దర్శనాని కరుదెంచు అనుష్ఠాన భక్తులు నల్లటి వస్త్రములను దరించియుందురు. అది వారిలోని వైరాగ్యమును సూచించును ఈ ప్రపంచములో లభించెడి సుఖములన్నియు అంధకారమును విరజిమ్ము అజ్ఞాన ప్రదర్శనలేనవి గ్రహించుటయే వల్లదుస్తులను ధరించుట లోని భావార్థము.

వ్రతకాలమున క్షురకర్మను ఆచరించరు. స్వామి దర్శనమై తిరిగి వచ్చిన తరువాత ఆచరించెదరు. వ్రతకాలమున పాపరహితులై యున్నందున సంకల్ప శుద్ధి అవసరము లేదు అని తలచుటయే క్షురకర్మను నిషేధించుటలోని భావార్థము దర్శనమై తిరిగి వచ్చిన తరువాత క్షురకర్మను ఆచరించెదరు. అనగా భగవత్సాక్షాత్కారము తరువాత సంకల్పనాశనము జరుగునని భావించుటయే అందులోని భావార్థము.

వ్రతకాలమునందు సాధకులు ఏక భుక్తమునే చేయుదురు, మితాహారము సాధనకు ఎక్కువగా ఉపకరించి హితమొనర్చును. అదియునుగాక ఏక భుక్తమునుసాగించి,ఏకవస్తు చింతనమును కొనసాగించవలెనని దృఢాభిప్రాయమును కలిగి యుండుటయే అందులోని అంతర్భావము.

ఏకభుక్తమును సాగించు సాధకులు మూడు వేళల యందు స్నానమాచరించుచుందురు మనోవాక్కాయ కర్మలయందు త్రికరణశుద్ధినికలిగియుండుటయే మూడు వేళల స్నానమాచరించుటలోని అంతరార్థము. కామ క్రోధ లోభములను మనస్సునుండి దూరము చేసుకొనుటయే అందులోని భావార్థము.

ఈ వ్రతకాలమున ఏ విధమైన హింసాత్మక చర్యలు గాని, ఆలోచనలు గాని కలుగకుండా చూసుకొనుచుందురు. సాత్వికమైన మితాహారమును భుజించి, యింద్రియములను నిగ్రహించుకొనుచుందురు.

ఇన్ని విధముల ప్రయత్నించుచుండిన బలవత్తర

మైన ఇంద్రియములను చంచలమైన మనోబుద్ధులు మానవుని దారి మళ్ళించి పతనము చేయు ప్రమాదము కలదు

"నాస్తి బుద్ధిః అయుక్తస్య" ఇంద్రియ నిగ్రహం లేని వానికి బుద్ధి స్థిరంగా నుండదు" అని గీత తెలుపుచున్నది. మనోబుద్ధులు భగవంతునిపైననే నిలిచియుండవలెను. అందుచేతనే అయ్యప్ప దర్శనానికి వెళ్ళు భక్తులు నిత్యము ఎక్కడో ఒకచోట నామ సంకీర్తనలో పాల్గొనుచుందురు. భక్తిగల వారితోనే మెలగుచుందురు. భగవానుని లీలలను శ్రవణము చేయుచుందురు భగవానుని గూర్చియే భాషించుచుందురు. ఆలయములందే రాత్రిపూట పరుండుచుందురు. దైవ స్మరణ తప్ప అన్య విషయముల పైకి మనసును పోకుండా చూసుకొనుటయే ఈ అభ్యాసముల వెనుక అంతరార్థమై ఉన్నది. సర్వులలో భగవంతునే గాంచు చుండవలయును. ఇదియే అయ్యప్ప భక్తులు ఆచరించ వలసిన ముఖ్య సాధన. అందుచేత అయ్యప్ప భక్తులు అందరిని "స్వామి" అని పిలుచుచుందురు. మనిషికి మనిషికి మధ్య భేదమును దర్శించరాదనియు, అందరి లోను, భగవంతునే వీక్షించవలయునని భావించుటయే అందులోని నిగూడార్థము.

ఈ విధమైన నియమములను పాటించుచు, సదా హృదయమున భగవానునే వీక్షించుచు సుకృతాత్ములైన ఈ భక్తులు 'ఇరుముడి'ని తలపై ధరించి "స్వామియే శరణం అయ్యప్ప" అంటూ చరించుచుందురు సర్వమూ స్వామినే ... నేను సంపూర్ణముగా స్వామిని శరణుజొచ్చియున్నాను. అని భావించుకొనుటయే ఆలా అనుకొనుటలోని అవగాహన.

ఈ విధముగా యాత్రకు బయలుదేరిన భక్తులు వాహనములలో బయలుదేరి, మార్గమధ్యమమున వచ్చు పవిత్రాలయములను దర్శించుచు "ఎరుమేలి" అను స్థానమునకు చేరుదురు. వాహన ప్రయాణము ఈ ఎరుమేలి వద్ద ఆగిపోవును. అక్కడ నుండి ప్రయాణ మంతయు పర్వత ప్రదేశముననే జరుగును శబరి మలైలో స్వామి ఆలయము చేరునంతవరకు ఇక కాలి నడకయే ( ఈ ఎరుమేలికి శబరిమలైకు మధ్య భయంకరమైన అరణ్యములున్నవి అచ్చట క్రూర మృగములు కూడా గోచరించుచుండును ) భగవంతుని చేరి తరించవలెనని భావించు సాధకుడు చరించ వలసిన మార్గము అంత సులభమైనది కాదు అని దానిని చూసి గ్రహించవచ్చును.

ఈ "ఎరుమేలి" వద్ద కూడా అయ్యప్పస్వామి ఆలయమొకటి కలదు. అచ్చట భక్తులు స్వామిని ఆరాధించుకొని బయలుదేరుచుందురు. అచ్చట బాణ ములు అమ్ముచుందురు ఒక్కొక్కరు ఒక్కొక్క బాణమును కొని చేతపట్టుకొని నడుచుచుందురు. దీని విషయము మీకు ముందు ముందు తెలియగలదు ఇలా బయలుదేరిన భక్త సమూహమును ఒక నాయకుడు నడుపుచుండును. భక్తబృందమునకు నాయకత్వము వహించు నాయకుని 'పెరియస్వామి' లేదా "గురు స్వామి" అందురు ఎవరు ఎక్కువసార్లు శబరిమలై యాత్ర చేసియుందురో వారే గురుస్వామి అనబడుదురు. గురుస్వామి ఆజ్ఞను సర్వులూ శిరోధార్యముగాభావింతురు. భగవత్సంబంధము ఎవరికి ఎక్కువగా నున్నదో అతడే గురుస్వామి అని భావము. మతి చెడిన పిచ్చివాడు పదిసార్లు శబరిమలైకి వెళ్ళి రావచ్చు. అంతమాత్రాన వాడు 'గురువవుతాడా ? ' దీనికి మీరు ఒక సమాధానం చెబుతారేమో ! పిచ్చివాడైతే మాత్రం సంస్కారము లేకుండే అన్ని సార్లు దేవుని దర్శించగలడా ! అని మీరు ప్రశ్నిస్తారు నిజమే ఇది మీరు అడుగదగిన ప్రశ్నయే కానీ ఒక్క విషయము ఆలోచించండి. సంస్కారం ఉండబట్టే తాను వెళ్ళగలిగాడు. కానీ మిమ్మలి నడిపే సంస్కారము లేనందున పిచ్చి నుండి బయటపడలేక యున్నాడు

"ఎరుమేలి" నుండి భక్తులు పాదయాత్ర చేయుచు శబరిమలైకి పోవుదురు "ఎరుమేలి" అను పదము

"ఎరుమకొల్లి" అను పదములకియొక్క రూపాంతరమే "ఎరుమకొల్లి" అనగా దున్నపోతును చంపిన స్థలము అని అర్థము సాధారణముగా మన శాస్త్రీయ పరిభాషలో చెప్పవలెనన్నచో యమునియొక్క వాహనము. యమధర్మరాజు మృత్యువునకు అధిపతి. మృత్యువు అజ్ఞానరూపము. కనుక దున్నపోతును వధించుట అనగా తమోగుణమును అంత మొందించుట అనిభావము దీక్షబూని ఆధ్యాత్మిక మార్గమున చరించిన అయ్యప్ప భక్తులు "ఎరుమెలి" వద్ద తమ తమస్సును అంత మొందించారని భావము.

ఆ తరువాత పాదయాత్ర చేయు భక్తులు రెండు కొండలను దాటుదురు. మొదటిది "కల్లిడుంకున్ను" రెండవది "కరిమలై" మొదటి కొండ కన్నను రెండవ కొండను ఎక్కుట బహు కష్టము

"ఎరుమెలి" ని దాటిన తరువాత వచ్చెడి ప్రశస్తమైన ప్రదేశము "కాలకెట్టి అంజలి" అనగా ఎద్దును కట్టిన చెట్టు అని భావము. "ఎరుమెలి" వద్ద తమోగుణము అంత మొందినది. "కాలికట్టి అంజలి" వద్ద రజోగుణ సంబంధమైన పశుప్రవృత్తి అంత మొందించబడింది. అదియే ఎద్దును కట్టిన చోటు అని భావము. పశుప్రవృత్తులను మనసులో నింపుకొని పరమాత్మను దర్శించుట దుర్లభము

కాలకెట్టి అంజలి దాటిన తరువాత భక్తుడు "అలస"ను సమీపించును. అలస అనగా కన్నీటి నది అని భావము ఈ దశలో భక్తుని యందు రజోగుణము, తమోగుణము దూరమగుటచేత సత్వగుణము మదిలో కలుగును. సత్వసంపద రాగానే భగవంతుని గూర్చిన సంకల్పాలు చల్లగా కదులును. గడచిన జీవితములో చరించిన దారుణకృత్యములు మదిని చెదరగొట్టును. పశ్చాత్తాపముతో హృది కదిలిపోవును. అదియే కన్నీటి నది అని పిలువబడినది. భగవంతుని కొరకై భక్తుని నేత్రాల వెంబడి కన్నీరు వరదలై పారిన సందర్భము. ఇదియే విషాదయోగము. విషాదయోగమును కలిగిన అర్జునుడు గీతను అధ్యయనము చేయుటకు అర్హుడాయెను. విషాద యోగయుక్తుడైన పరీక్షిత్తుడు భాగవత శ్రవణమునకు అర్హుడాయెను విషాదయోగభరితుడైన వాల్మీకి రామాయణ గాథను రచించ గలిగెను.

ఈ అలస వద్ద నదీస్నానమాచరించవలెను. ఆ తరువాత ఒక రాయిని చేతపట్టుకొని భక్తుడు ముందునకు కదులును అలసలో చేతపట్టిన రాయిని 'కలితుంకున్ను' అనెడి గిరి శిఖరమున పడవేయును. 'కలితుంకున్ను' అనగా "రాయి పడవేసిన కొండ" అని అర్థము.

అలసానదిలో స్నానమాచరించి, బాష్పాభిషేకము జరిగిన తరువాత అక్కడ ఒక రాతిని సాధకుడు చేతపట్టుకొనును భక్తి కలిగిన తరువాత తాను భక్తుడనెడి అహంకారమును సాధకుడు పట్టుకొనును. అదియే రాయి ఎత్తుకొనుట అని గ్రహించాలి. ఈ అహంకారము బండ బరువులాంటిది. దీనిని 'కలితుంకున్ను' అనచోట వదిలిపెట్టును. కొండ శిఖరముపై వదిలిపెట్టును. అనగా ఎత్తయిన వాడగు భగవానుని పాదముల చెంత వదిలిపెట్టును.

అలసానదిలో స్నానమాచరించి, అచ్చట ఎత్తుకొనిన రాయిని కలితుంకున్ను వద్ద సాధకుడు వదిలిపెట్టును. ఆ తరువాత ప్రయాణమును కొనసాగించు 'కరియలంతోడు' అను ప్రాంతమును చేరును. 'కరియలంతోడు' అనగా "ఎండుటాకు కాలవ" అని అర్థము. "కలితుంకున్ను" వద్ద అహంకారాన్ని వదిలిపెట్టగానే సాధకుని ఆంతర్యము ఎండుటాకువలె తేలికపడును. జీవనయాత్ర సౌలభ్యమును సంతరించుకొనును. ఇప్పుడు సాధకుడు "కరిమలై" వద్దకు వచ్చును.

"కరిమలై" అనగా ఏనుగుకొండ అని భావము. ఇది చాలా కష్టతరమైన ప్రయాణము. భగవత్సాన్నిధ్యము లభించే ముందు సాధకుని యాత్ర సుగమముగా నుండదు. అయిననూ సాధకుడు భక్తిశ్రద్ధలతో యాత్రను కొనసాగించవలెను. "కరిమలై" ని అధిగమించేటప్పుడు

( తరువాయి 4౦ వ పేజీలో )

వేసవి తరగతుల ప్రసంగం-10

# ప్రేమ యిచ్చుకునేదిగాని పుచ్చుకునేది కాదు

భగవాన్ బాబావారి దివ్యప్రబోధ

ప్రేమ రూపంబు బ్రహ్మంబు ప్రేమ మయము
ప్రేమ ప్రేమతో సంధింప నీమ మగును
కాన ప్రేమను గట్టిగా కలిగియున్న
అద్వితీయము పొందగ నర్హుడగును

పూర్ణప్రేమయందె పుట్టును సౌఖ్యంబు
సత్య త్యాగనిరతి శాంతులబ్బు
ప్రేమ తెలియకున్న క్షేమంబు లేదొకా
సత్యమైన బాట సాయి మాట

**ప్రేమస్వరూపులైన విద్యార్థులారా!**
**విద్యార్థినులారా!**

ఈనాటి సమాజ వ్యవహారములన్నియు కూడను ఆత్మస్తుతి, పరనింద, ఇచ్ఛాచారములు అనేటటువంటి త్రిగుణములు అమితముగా వ్యాపించి, ఒకనాడు కీర్తి పొందిన భారతదేశము యీనాడు కల్లోలములచేత కఠినముగా కనుపించుచున్నది. దీనికి కారణమేమిటి? మానవుడు పరిపూర్ణ ప్రేమస్వరూపమైన దివ్యతత్త్వమును మరచి లౌకికమైన, భౌతికమైన వాంఛలకు లోబడి, స్వార్థ స్వప్రయోజనముల చేత ప్రేమతత్త్వమును విస్మరించటమే దీనికి మూలకారణము

ప్రేమ అనే రెండక్షరములు తెలియని భారతీయుడు లేడు ఈ ప్రేమయందే విశ్వమంతయు యిమిడి వున్నది ఈ ప్రేమకు ప్రేమయే సాటి. ప్రేమను వ్రాయుటకు భాష లేదు. వాక్కులు చాలవు కనుకనే 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' మనస్సునకుగాని, వాక్కునకుగాని అతీతమైన యీ ప్రేమతత్త్వాన్ని ఏ రీతిగా ఎవరు వర్ణించగలరు? కనుక యీ ప్రేమకు సమానము ప్రేమయే. 'అనిర్వచనీయం ప్రేమ' అన్నాడు నారదుడు. ఈ ప్రేమ మానవత్వంలో అనేకవిధములైన రూపాలను ధరిస్తూవున్నది. కానీ తల్లీబిడ్డల మధ్యనున్న, భార్యాభర్తల మధ్యనున్న, గురుశిష్యుల మధ్యనున్న, యజమాని దాసుని మధ్యనున్న బంధమును ప్రేమగా భావిస్తున్నారు ప్రాకృత జనులు ఇది నిజమైన ప్రేమ కాదు ఇది ప్రేమ అని అనిపించుకోలేదు ఇది అనురాగము మాత్రమే.

ప్రేమ అనగా పరిపూర్ణమైన పవిత్రత్వమును పైన ప్రసరింపచేయటమే. ప్రేమ నిస్వార్థమైనది. ఈ ప్రేమ పాతాళలోకమునుండి రాలేదు ఆకాశమునుండి ఊడిపడలేదు ప్రేమ సహజ స్వరూపము. కనుక యిట్టి సహజమైన, సత్యమైన, నిత్యమైన ప్రేమతత్త్వాన్ని మానవుడు కోల్పోవుచున్నాడు ఈ ప్రేమకు సాటి మరొక పదార్థము యీ జగత్తున కానరాదు.

'న కర్మణా, న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః' అని వేదము చెప్పుచున్నది అనగా యజ్ఞయాగాది కర్మలచేతగాని, ప్రజాసంప

చేతగాని ధనముచేతగాని అమృతతత్త్వము మనకు ప్రాప్తించదు. త్యాగముచేతనే అమృతతత్త్వము, ఆనందము ప్రాప్తిస్తుందని శ్రుతి ప్రమాణము. ఇట్టి పవిత్రమైనదానికంటె అమృతతత్త్వము వేరొకటిలేదని శాస్త్రములు బోధిస్తూవచ్చాయి ఐతే ఇంత మధురమైన, సత్యమైన, నిత్యమైన అమృత తత్త్వమును మనము విచారించినప్పుడు, యీ అమృతాన్ని ప్రేమతో పోల్చుకున్నప్పుడు యీ అమృతము కేవలము చప్పిడి నీరుగా వుంటుంది అమృతము కంటే అధికమైనది ఈ ప్రేమ ఇట్టి పవిత్రమైన, దివ్యమైన, పరిశుద్ధమైన, ప్రమాణపూర్వకమైన ఈ ప్రేమతత్త్వాన్ని మానవుడు గుర్తించలేకపోవుచున్నాడు. ఈ ప్రేమ పరమాత్మనే నాట్యమాడిస్తుంది భక్తుని కూడను నాట్యమాడిస్తుంది తానూ నాట్యమాడుతుంది ఒకే పర్యాయము పరమాత్మను, భక్తుని, తాను కూడ త్రిగుణాత్మక తత్త్వముతో తాండవమాడుతుంది. ఐతే యిట్టి ప్రేమ స్వార్థపరుల హృదయములలో నిలవటానికి వీలులేదు. నిస్వార్థమైన నిర్మలమైన, నిష్కళంకమైన, దివ్యమైన హృదయములో మాత్రమే నివసిస్తున్నది. ఈ ప్రేమను రత్నముగా పోల్చుచున్నది శాస్త్రము. ఇది ప్రేమ రత్నము ఐతే యీ రత్నము మనకు 'ఎక్కడ దొరుకుతుంది ? సర్వ సామాన్యంగా మార్కెట్టునందుగాని లేక రత్నవర్తకుల దగ్గరగానీ లభ్యమవుతుంది అని భావిస్తుంటాము. రత్నములు చేపల బజారులో రాసుల నరె పోసి అమ్మేవి కావు. ఈ రత్నము యొక్క విలువ అధికమగుటచేత భద్రమైన పెట్టెయందుంచి దానిని కొనదలచే వ్యక్తిని మాత్రమే లోపలకు తీసుకు వెళ్లి రహస్యముగా యీ రత్నమును చూపుతుంటారు సామాన్యమైన ఒక వజ్రమునే మనము అనేక విధములుగా భద్రము చేస్తుండగా 'దివ్యమైన ప్రేమరత్నాన్ని ఇంక ఎంత భద్రం చేసుకోవాలి? కనుక ఈ రత్నము ప్రేమ రాజ్యమునందు మాత్రమే, ప్రేమ వీధియందు ప్రేమ షాపునందు మాత్రమే మనకు లభ్యమవుతుంది. ఐతే దీనిని అమ్మేవారు ఎవరు ?

ప్రేమమయమై, ఆహారపానీయములు కూడను ప్రేమమయమై, జీవితమే ప్రేమమయమైన వ్యక్తికి మాత్రము యీ ప్రేమను అమ్మటకు లైసెన్సువుంది. అట్టి ప్రేమను ప్రేమతో పోల్చుకోదగినవాడు ఒక్క పరమాత్మ తప్ప వేరెవ్వరికీ యీ అర్హత లేదు. ప్రేమ స్వరూపుడైన ప్రేమతత్త్వమునకే ప్రేమ తెలుస్తుంది ప్రేమ యొక్క విలువ. కనుక ఈ ప్రేమతో మనము పరమాత్మని ఎంతగా ప్రేమిస్తామో మానవునికి అంతగా ఆనందము లభ్యమవుతుంది. ఈ ప్రేమ పరమాత్మపై ఎంత తక్కువ అవుతుందో మన ఆనందము అంత తక్కువగా వుంటుంది " యద్భావం తద్భవతి " మన ఆనందమునకు మన ప్రేమయే సాటి. ఎంతటి ప్రేమయో అంతటి ఆనందము మనకు లభ్యమవుతుంది. **కనుక భగవంతుని మనము అంతగా** ప్రేమించటానికి ప్రయత్నించాలి కానీ ఈనాటి మానవులు భగవంతుని ప్రేమించినట్లుగా నటన చేస్తున్నారే గానీ యీనాటి ప్రేమలు స్వార్థపరమైనటువంటివి. ఏదో కొన్ని అభీష్టములను పురస్కరించుకొని ప్రేమించేటటువంటివి. ఏవో కొన్ని ఆశలు కల్పించుకొని ప్రేమించేవి. ప్రేమ వ్యాపారసంబంధమైనది కాదు కొన్ని యిచ్చి, కొన్ని పుచ్చుకొనేటటువంటి సంబంధము కాదు ఇచ్చి పుచ్చుకొనేటువంటి సత్యమైన, నిత్యమైన తత్త్వము యీ ప్రేమ తత్త్వము. ప్రేమ యిచ్చుకునేదే గాని పుచ్చుకొనేది కాదు.

భగవంతుని పొందుటకు అనేక మార్గములుంటున్నవి శాంతిమార్గము, సఖ్యమార్గము, అనురాగమార్గము, వాత్సల్యమార్గము, మధురమార్గము ఈ ఐదు మార్గములలో కూడను అంతో యింతో స్వార్థము వుంది. కానీ ప్రేమ మార్గమందు ఎట్టి స్వార్థము వుండదు. కనుక అన్ని మార్గములు కూడను ప్రేమ మార్గములో లీనమై వున్నవి సర్వ మార్గ సమ్మిళితమయినటువంటి రాజమార్గమే యీ ప్రేమ. ఈ ప్రేమ సర్వులయందు

వున్నట్లుగా మనము భావించాలి ప్రేమ పరమాత్మ స్వరూపము "ఈశావాస్య మిదం సర్వమ్" "వాసుదేవ సర్వమిదం" అందరియందు కూడను పరమాత్మ వున్నాడు. కనుక ఎవరిని ప్రేమించినా పరమాత్మను ప్రేమించినట్లే. ఈ విశాలమైన ప్రేమ తత్త్వమును యీనాడు మానవుడు విస్మరించి లౌకికమైన సంకుచితమైన ప్రేమను విశ్వసించి తన జీవితమును వ్యర్థము గావించుకుంటున్నాడు

మానవునికి మానవునికి మధ్య నున్న ప్రేమ సంబంధమును పెంచే నిమిత్తమై అప్పుడప్పుడు దివి నుండి భువికి దిగివస్తుంటాడు భగవంతుడు తన పని ఏమిటి? ప్రేమతత్త్వమును పెంచుటయే తన ప్రధానమైన పని. కానీ యీనాడు ఆ ప్రేమతత్త్వమును చక్కగా అర్థం చేసుకోలేక, అనర్థములకు గురియై జీవితమునే మాయామయముగా మార్చుకుంటున్నాడు కనుక మానవత్వములో వున్న దివ్యమైన ప్రేమ తత్త్వమును ప్రతి వ్యక్తి కూడను అర్థము చేసుకోవాలి. ప్రతి మానవుని యందు సమానముగా వుంది ప్రేమ. ఐతే భౌతికమైన, లౌకికమైన ప్రాకృత సంబంధమైన జీవితములో యీ ప్రేమను అనుభవిస్తూ రావటంచేత అనేక పేర్లతో యీ ప్రేమ ప్రకాశిస్తూ వచ్చింది.

భార్యాభర్తల ప్రేమను మోహమన్నారు. తల్లీ బిడ్డల ప్రేమను వాత్సల్యమన్నారు బంధు మిత్రుల ప్రేమను అనురాగమన్నారు కానీ భగవంతునిపై ప్రేమను భక్తి అన్నారు ప్రేమ ఒక్కటే మార్గములు వేరు వేరు. అనుభూతులు వేరు వేరు కానీ గమ్యము ఒక్కటే ఈ భౌతికమైన జీవితమును సార్థకం గావించుకునే నిమిత్తము ప్రేమను యిన్ని విధముల మార్పును కలిగిస్తూవచ్చారు. దీని వలన మానవుడు నిరంతరము ప్రేమను మార్చుకుంటూ వస్తున్నారు. ప్రేమ నిశ్చలమైనది మార్పు చెందనిది అట్టి నిత్య సత్యమయిన ప్రేమతత్త్వము ఈనాటి మానవుడు తన స్వార్థముతో అనేక విధములుగా మార్పులు చేస్తూవచ్చాడు బాల్యమునందు ఆటపాటలతో, విద్యా బుద్ధులతో యీ ప్రేమను అనుభవిస్తున్నాడు. పుట్టిన తక్షణమే తల్లి ఒడియే స్వర్గమని భావించి తల్లి ఒడిని వదలక నిరంతరము తల్లిని ప్రేమిస్తాడు. పెరుగుతూ పెరుగుతూ విద్యయే ప్రధానమని విద్యనే ప్రేమిస్తూ తల్లి ఒడిని మరచిపోతాడు విద్య పూర్తి అయిన తరువాత విషయ వాసనలలోకి దిగి కుటుంబమునే ప్రేమిస్తాడు విద్యను మరచిపోతాడు. కానీ ఆలు బిడ్డలను కొంతవరకు సాకిన తరువాత ధనముపైన ఆశ పెరుగుతుంది. ఆలుబిడ్డలపైన ప్రేమ తరుగుతుంది. తదుపరి ధనముపై కూడను విరక్తి కలుగుతుంది. దైవముపైన భక్తి పెరుగుంది. ఈ విధముగా మానవుడు ఒకే ప్రేమను అనేక విధములుగా మార్పు చెందుతూ అనుభవిస్తున్నాడు

బాల్యము నందున పలువురతో కూడి
ఆట పాటల యందు ఐక్యమగును
యవ్వనంబలరిన అలరు విలుని పోల్కి
కామినీలోలుడై క్రాలుచుండు
అర్థవయస్సున ఐహికంబున మునిగి
ద్రవ్యమార్జించుట దవిలియుండు
ముదిమి వచ్చిన యంత మురహరి తెలియక
అది యిది లేదని అలపించు
వివిధ దుర్వ్యసనంబులు వీడలేక
భక్తి మార్గంబు వెతుక ఆసక్తి లేక
కర్మపంకిలమున బడి క్రాలునుండు
మట్టి కల్సును జన్మంబు మానవుండు.

విద్యార్థులారా! ప్రేమ మనకు మధ్యలో వచ్చిన Passing cloud కాదు ఇది ప్రారంభముతో పాటు నిరంతరము నిత్యమై సత్యమై వుండు ఆత్మ తత్త్వమే గానీ మధ్యలో మార్పు చెందేది కాదు. కనుక

యిట్టి ప్రేమను మనము క్షణక్షణమునకు మార్పు చేసుకోరాదు. మన మనస్తత్వము ప్రేమ మయంగా మార్చుకోవటానికి ప్రయత్నించాలి ఏ కర్మలను నీవు ఆచరించినప్పటికిని, ఏ ధర్మములో నీవు ప్రవేశించినప్పటికిని అన్నియు భగవత్ప్రీత్యర్థముగా భావించి అర్పించటము సరియైన సాధన. ఎన్ని సాధనలు చేసినప్పటికి, ఎన్ని యజ్ఞయాగాది క్రతువులు ఆచరించినప్పటికిని ప్రేమతత్త్వము లేక అన్నియు వ్యర్థమే ప్రేమయే ప్రధాన కేంద్రము. ఈ ప్రేమ దిక్సూచి యంత్రము వంటిది. ఈ యంత్రమును ఎక్కడ పెట్టినప్పటికిని దీని ముల్లు ఉత్తర దిశకే పోతుంటుంది. అదే విధముగా మన జీవితములోపల ప్రేమతత్త్వము ఏ కర్మలలో మునిగినప్పటికి దైవము వైపున తిరగాలి. అంతకంటె గమ్యము, ధన్యము, వేరొక్కటి లేవు. గ్రంథములు చదివినంత మాత్రమున యిది కేవలము జ్ఞానానికి సంబంధము కాదు. జపధ్యానములు సల్పినంత మాత్రమున యిట్టి భక్తిప్రపత్తులకు సంబంధము కాదు. ఇది కేవలము ప్రేమకు చిహ్నముగా భావిస్తున్నారే గాని ఇది ప్రేమతో కూడినది కాదు

మానవుని హృదయమంతయు ప్రేమమయంగా మార్చుకోవాలి ఈ ప్రేమమయంగా మారినప్పుడే దేశము శాంతిమయంగా ఉంటుంది. మన కన్నులకు నీలిరంగు ఉన్న అద్దాలు ధరించినప్పుడే ప్రపంచమంతా నీలివర్ణముగా వుంటుంది. మన దృష్టిని ప్రేమమయంగా మార్చినప్పుడు దృష్టి అంతా బ్రహ్మమయంగా వుంటుంది మన దృష్టిని ప్రేమమయంగా మార్చక కేవలం సృష్టి అంతా బ్రహ్మమయంగా కావాలంటే ఎలా అవుతుంది? కనుక దృష్టిని ఈనాడు మనము ప్రేమమయంగా మార్చుకోవాలి. ఈనాటి యువకులకు యిది చాలా అవసరమైనది ఈ ప్రేమ కేవలము సంకుచితమైన ప్రేమలు కావు శరీర మనస్తత్వములకు సంబంధించినటువంటిది కాదు ఇది హృదయానికి సంబంధించినటువంటిది అందరియందు సమత్వమై వున్నది ప్రేమయే తల్లి, భార్య, బిడ్డలు సర్వులు కూడను దేహపరముగా సంబంధము వుండవచ్చును. కానీ ఆత్మ సంబంధము అందరికీ ఒక్కటే. "ఏకోవసి సర్వభూతాంతరాత్మ"

ఎన్నో బల్బులు వుంటుంటాయి ఒక్కొక్క బల్బు ఒకొక్క రంగుగా వుంటుంది వోల్టేజి వేరువేరుగా వుంటుంది. కానీ అన్నిటియందు కరెంటు ఒక్కటే మన దేహములు, మన భావములు కేవలము బల్బుల వంటివి. మన సంకల్పములంతా కూడను వోల్టేజివంటివి. అన్నింటియందు కూడను యీ ప్రేమ ఒక్కటే ప్రసరిస్తున్నది. ఈ ప్రేమను మీరు స్వార్థముగా వుపయోగించుకోవటానికి ప్రయత్నించకండి. ప్రేమ ని అనురాగముగా, అనురాగమును ప్రేమగా భావించుకోటం చేతనే యీనాడు మానవుల బుద్ధులు వికార మార్గములను అనుసరిస్తూ వస్తున్నాయి. ప్రాకృత సంబంధములైన ప్రేమలన్నీ అనురాగములే గానీ ప్రేమలు కావు. ఈ అనురాగములన్నీ బంధించునవేగానీ విముక్తి నిచ్చునవి కావు నిజమైన ప్రేమే, నిజమైన విముక్తి ప్రేమకు బంధనే లేదు. ప్రేమకు శ్రమయే లేదు. ప్రేమకు బాధనే లేదు మన సర్వస్వముగా ప్రేమ వున్నప్పుడే ఈ ప్రేమతత్త్వము ప్రసరిస్తుంది.

ఈనాటి హృదయములన్నీ ప్రేమరహిత మరుభూములుగా మారుతున్నాయి. మానవుని యందు దయ, కరుణ క్షీణించిపోతున్నాయి. అరణ్యములో జీవించే క్రూరమృగము కంటె హీనంగా మానవుడు ప్రవర్తిస్తున్నాడు. మానవునికి మానవునికి మధ్యనున్న సంబంధ బాంధవ్యము విరోధముగా రూపొందుతూ వస్తున్నది. తల్లిపైన బిడ్డకు గాని, బిడ్డపై తల్లికి గాని ప్రేమని ఉండటం లేదు. ఈనాటి సోదరులయొక్క ప్రేమ ఏ రీతిగా వుంటున్నది ? ఆనాటి సోదరుల ప్రేమ ఏ రీతిగా వుండేది ? ఏనాడూ కలిసి మెలిసి వుండి, అన్యోన్య సంబంధమును పెంచుకొని ఆనందానురాగాలతో జీవిస్తూ వచ్చారు. దీనికి పాండవులు. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు సరియైన ఆదర్శము.

( తరువాయి 42 వ పేజీలో )

# గీత - అమృతవర్షిణి

సాయి గంగా మహాదేవ్

శ్లో॥ యథా దీపో నివాతస్థో
వేంగతే సోపమా స్మృతా ।
యోగినో యత చిత్త
స్య యుంజతో యోగమాత్మనః॥

— ప్రపంచమునందు జ్ఞానము మూడు రకములుగా వుంటున్నది 1. అగ్రహణము 2 అన్యగ్రహణము 3. గ్రహణము. కారుచీకటి యందు ఏదియునూ గోచరింపదు. అప్పుడు దేనినీ గుర్తింప వీలుకాదు. అట్లే మనస్సు, ఇంద్రియాదులు తమోగుణమునందున్న వేళలో ఏదియునూ స్ఫురింపదు. దీనినే అగ్రహణము లేదా అజ్ఞానము అన్నారు. ఇకపోతే_ మసకచీకటి యందు అనగా మందప్రకాశమునందుగాని, చలించే దీపప్రకాశమునందుగాని ఒకదానిని గాంచి మరొకటిగా తలంచే అవకాశము కలుగుతున్నది. మసక వెలుతురులో త్రాడును చూచి సర్పమనుకొనుట దానికి ఉపమానము. దానినే అన్యగ్రహణము లేదా విపరీత జ్ఞానము అన్నారు. ఇవి రెండునూకాక చక్కని ప్రకాశము లోపల సమస్తము ఉన్నదున్నట్లుగా గోచరమౌతుంది. దీనినే గ్రహణము లేదా సుజ్ఞానము అన్నారు.

ఈ మూడు అవస్థలలో మొదటిది తమోగుణము, రెండవది చిత్తవృత్తులతో కూడినటువంటిది రజోగుణము, మూడవది సత్వగుణము. తమోగుణమునందు చిత్తము నిద్రాముద్రితమై వుంటుంది. రజోగుణమునందు చిత్తము వృత్తులతో కూడివుంటుంది. సత్వగుణమునందు చిత్తము వృత్తిరహితమై ఏకాకారమయి వుంటుంది భగవానుడిచ్చట—ఆత్మసమాధిని అనుష్ఠించుచున్న యోగి యొక్క చిత్తము గాలిలేనిచోటనున్న దీపమువలె వుంటుందని సెలవిచ్చారు. చిత్తమునకు దీపము ఉపమానముగా ఎందుకు పేర్కొన్నారో గమనించాలి. అసలు "చిత" మనగా ఏమిటి? "చేతయతీతి చిత్తం" అనగా తెలియజేయునది చిత్తము. సత్యమును సత్యముగా, అసత్యమును అసత్యముగా గోచరింపచేయునదే చిత్తము దీపలక్షణము కూడా అట్టిదే. కనుకనే ఈ ఉపమానమును తీసుకోవటం జరిగింది.

గాలి లేనిచోటనున్న దీపము మాత్రము కదలక యుండి పూర్ణప్రకాశముగల్గి అన్నింటినీ చక్కగా విశదపరుపగల్గుతున్నది అట్లే చంచలత్వములేని చిత్తము, వృత్తిరహితమైన చిత్తము, ఏకాకారమయి యుండి ఆత్మానుష్ఠానపరునకు గురుస్వరూపమై నిలబడి జగత్తుయొక్క అస్థిరత్వమును, ఆత్మయొక్క దివ్యత్వమును తెలుపగలుగుతున్నది. వాసనామయులయొక్క చిత్తము ఈ విధముగా నుండదు. అది చంచలము, వైరాగ్యము, ఆత్మాభ్యాసము ఈ రెండింటి వలననే చిత్తము వృత్తిరహితమౌతుంది. పతంజలి మహర్షుల వారు "యోగః చిత్తవృత్తి నిరోధః" అన్నారు. చిత్తవృత్తిని నిరోధించుటే యోగమనివారి అభిప్రాయము.

ఒక పశువు ఆ యింటికి, ఈ యింటికి మేతకు వెళ్తున్నదంటే దాని యింటిలో దానికి ఆహారం దొరకటం లేదని అర్థము. అలాగే చిత్తమునకు తనయందున్న ఆత్మానందమును రుచి చూపని కారణము చేతనే అది వాసనల వలన అటూ ఇటూ చలిస్తున్నది. కావున చిత్తవృత్తి నిరోధమునకు మొట్టమొదట ఆత్మసంతృప్తిని కలిగివుండి వైరాగ్యమును అలవరచుకోవాలి వైరాగ్యమనగా వస్తు పరిత్యాగము కాదు. దుఃఖములందు ఉద్విగ్నమనము చెందకుండుట; సుఖముల లోపల ఆసక్తికలిగి లేకుండుట. అనగా సుఖ, దుఃఖములందు సమచిత్తమును కలిగివుండుటే వైరాగ్యము. ఇదియే నిజమైన యోగము. ఇట్టి చిత్తవృత్తిరహితమైన యోగము పరమాత్మానుగ్రహముచే ఎల్లరికీ ప్రాప్తించి చిదానందమగ్నులగుదురు గాక! ఇతిశమ్.

# కామక్రోధములే ప్రబల శత్రువులు

-శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాస్వామి

మానవుని యొక్క ప్రవృత్తిలో ఒక విచిత్రం ఏమి కనిపిస్తుందంటే, ఏది మంచి, ఏది తప్పు అని అందరికీ తెలిసికూడా, ఆచరణలో మాత్రం వైపరీత్యం కనబడుతూ ఉన్నది ఈ వైపరీత్యం ఎందుకు వస్తున్నది ? అందరికి సుఖంపొంద ఆశ వున్నది. కాని సుఖమునకు హేతువైన ధర్మాన్ని ఆచరించడానికి మాత్రం మనస్సు రావటంలేదు. దుఃఖం మీద ఎవరికీ ఆశ లేదు. ప్రతివారు నాకు దుఃఖం అక్కరలేదనే కోరుకుంటున్నారు. కాని ఆ దుఃఖమును యిచ్చే అధర్మాన్ని మాత్రం ఆచరిస్తున్నారు. ఈ వైపరీత్యాన్ని మనం చూస్తూఉన్నాం.

స్వర్గ సుఖాన్ని, కైలాస సుఖాన్ని గురించి వర్ణించేటప్పుడు అందరి నోళ్ళూ ఊరుతూవుంటాయి. దానిని సాధించడానికి సాధనలు చేయాలంటే మాత్రం అమ్మ ! మాకు చేతకాదంటారు అయితే మనిషి తనకు దుఃఖం అక్కరలేదంటూ, ఆ దుఃఖమునకు హేతువైన పాపాన్ని మాత్రం ఆచరిస్తున్నాడు అయితే మనిషి తెలిసి తెలిసి ఎందుకు ఈ పాపాలను చేస్తున్నాడు? కామ క్రోధములే దీనికి కారణం ఈ రెండింటి వలననే మనిషి పాపాలను చేస్తున్నాడు ఇవే చేయిస్తున్నాయి. ఈ రెండూ మానవుని పాలిటి ప్రబలమైన శత్రువులు. మనం ఎవర్ని శత్రువులు అంటాం ? మనకు ఎవరైతే అపకారం చేయటానికి సిద్ధంగా ఉన్నారో, మనకు ద్రోహం చేయటానికి సిద్ధంగా ఉన్నారో వారిని శత్రువులుగా భావిస్తాం. ఈ కామ క్రోధములనే శత్రువులు మనకు అపారమైన ద్రోహం చేస్తున్నాయి, అపకారం చేస్తున్నాయి. ఆ రెండింటి వలననే మనం అకృత్యములు చేస్తున్నాము ఎవరైతే ఈ రెండునూ జయిస్తారో వారు అకృత్యములనే చేయరు

మానవుని యొక్క అంతఃకరణలో ఈ రెండూ కూర్చొని వానితో చేయరాని అకృత్యములు చేయిస్తున్నాయి. రావణాసురుని యొక్క ఐశ్వర్యాన్ని చూస్తే ఆంజనేయస్వామికి కూడా ఆశ్చర్యం కలిగింది అటువంటి సకల సంపదలు కలిగినటువంటి రావణుడు ఎందుకు పతనం జెందాడు ? కేవలం కామాధిక్య మనస్కుడైనందువలన ఆ ఒక్కదానికి దాసుడై పతనం జెందాడు జగన్మాతయైన సీతాదేవిని చెడ్డ దృష్టితో చూచాడు. దానితో పతనమైనాడు. కామం అనేది ఏ విధముగా మనిషిని చెడగొడుతుందనటానికి ప్రబలమైన ఉదాహరణ రావణాసురుడు. ఇక మనం కూడా రావణాసురునివలె తయారవుతే మనకు కూడా అదే గతి పడుతుంది. కనుక మనం రావణాసురులం కాకూడదు. అలాగే క్రోధమనేటటువంటిది కూడా అనేక అక్రమాలను చేయిస్తూ ఉంటుంది

సుందరకాండలో ఆంజనేయస్వామి ఈ క్రోధమును గురించి చెప్పాడు ఆంజనేయస్వామి రావణాసురునికి మంచి మాటలు చెప్పినప్పటికి, వినాశ కాలం వచ్చింది కనుక వినకపోగా అపకారం చేయ తలబెట్టి ఆంజనేయుని తోకకు నిప్పంటించమని ఆజ్ఞాపించాడు. కాని ఆ అగ్ని సీతామహాదేవి పాతివ్రత్య మహిమవలన ఏ విధమైన అపకారం చేయలేదు. కోపంతో ఆంజనేయుడు లంకాపట్టణమునంతా భస్మీపటలం చేశాడు. దాంతో ఆయన కోపం చల్లబడింది. అప్పుడు కూర్చొని ప్రశాంతంగా ఆలోచించాడు పెద్ద అపరాధం జరిగిపోయిందే యని బాధపడ్డాడు. ఏమిటి

ఆ అపరాధం ? కోపంతో లంకాపట్టణమును తగుల బెట్టాను గదా ! ఈ లంకలోనే సీతాదేవి ఉన్నదిగదా ! ఆమెకు ఏమైనా ప్రమాదం జరిగిందేమోనని బాధ పడ సాగాడు కోపం అంటే ఎంత చెడ్డదో అప్పుడు చెప్పాడు హనుమంతుడు. " కోపం వచ్చినవాడు ఏ అకార్యమునయినా చేస్తాడు. అత్యంత ఆదరపాత్రులు, గౌరవపాత్రులయినటువంటి వారిని కూడా హింసించ డానికి కూడా ఏమాత్రం వెనుకాడడు సాధువులు సత్పురుషులను కూడా ఇష్టం వచ్చినట్లు మాట్లాడుతాడు. చేయరాని పనులు చేస్తాడు అనరాని మాటలు అంటాడు వివేకాన్ని కోల్పోతాడు ఇది కోపం వచ్చిన వాడి లక్షణం" అంటాడు ఈ కోపం అనేది మనిషికి అత్యంత శత్రువు అని తెలుస్తున్నది

" మనం అత్యంత వివేకులం, విజ్ఞతకలవారం, పండితులం మనం కూడా ఆ పని చేస్తామా? అనేది ఒక ప్రశ్న ? దానికి భగవంతుడు చెప్పాడు. " మనం తెల్సినవారం, వివేకులం అంతా వాస్తవమే. కాని కోపం వచ్చినప్పుడు వివేకం, జ్ఞానం అంతా అవృతమై పోతుంది ఎలా అవృతమైపోతుంది ? దానికి చక్కటి ఉదాహరణ చెప్పాడు. ఒక అద్దం ఉన్నది దానిలో చూచుకుంటే మన ముఖం మంచిగా కనిపిస్తుంది కాని అదే అద్దం మీద మురికి చేరితే, మన ముఖం సరిగా కనిపించదు. అద్దానికి మన ప్రతిబింబమును గ్రహించే స్వభావం ఉన్నదిగాని, ఆ మురికితో ఆ శక్తి అవృతమై పోయింది. ఆ మురికిని తొలగిస్తే యథాప్రకారంగా మన ముఖము యొక్క ప్రతిబింబం ఆ అద్దంలో కనిపిస్తుంది అలాగే మనిషికి ఉన్నటువంటి ఈ వివేకం, ఈ జ్ఞానములు ఈ కామక్రోధములనే కన్మలంతో కప్పబడిపోతున్నాయి. ఈ కన్మలమును తుడిచివేస్తే మళ్ళీ మన యొక్క వివేకం ప్రస్ఫుటమవుతుంది. ఎప్పుడైతే వివేకం ప్రస్ఫుటమవుతుందో మన వలన తప్పులు జరుగవు. కనుక ముఖ్యంగా గమనించ వలసినది ఒకటున్నది. ఈ కామక్రోధములనేవి నాకు అత్యంత శత్రువులు గనుక. వీటికి ఏమాత్రం అవకాశం ఇవ్వకూడదనే విషయమును మొట్టమొదట గ్రహించాలి. ఈ కామక్రోధాదులకు ఏమాత్రం అవకాశం యివ్వకుండా ఎవడు జీవితాన్ని గడుపుతాడో, వాడు పవిత్రుడైనటువంటి వ్యక్తి వాని జీవితంలో సత్కార్యములు చేయకుండా ఉండటం, అసత్కార్యములు చేయటం అనేటటువంటి వైపరీత్యం కలుగదు. ఎవడైతే యీ కామక్రోధములను దూరం చేయలేడో, వాని జీవితంలో మాత్రం అవైపరీత్యం కలుగుతూనే ఉంటుంది అందువలన మనం యీ కామక్రోధములకు దూరంగా ఉండాలి.

శంకరులవారు అత్యంత బాల్యదశ యందే యీ అరిషడ్వర్గములను జయించారు. ఎలా జయించారు ? యీ కామమును వస్తు విచారముతో నాశనం చేశారు. దేనిమీద మనకు ఆశ కలుగుతున్నదో, ఆ వస్తువువలన వాస్తవంగా మనం అభిలషించే సుఖం కల్గుతున్నదా ? ఆలా విశ్లేషిస్తే కలగటానికే అవకాశం లేదు. ఎందుకని అంటే ... మనం ఏదైనా ఒక క్రొత్త వస్తువు చూశామంటే, అది నా దగ్గర ఉంటే ఎంత బాగుంటుందనిపిస్తుంది ఆ తరువాత దానిని ఎలా కొట్టేయాలా అనే భావన మనసులో ప్రవేశిస్తుంది. ఏవో అక్రమాలు చేయవలసివస్తుంది. దానిని పొందిన తరువాత ఉత్సాహంగా కొంతకాలం దానిని చూసుకుంటాం ఆ తరువాత అది తగ్గిపోతుంది అసలు యీ మానవుడు యీ కామం ప్రభావం వలననే తప్పు చేస్తుంటాడు. సహజంగా స్త్రీ విషయంలో మానవుడు పొరపాటు పడుతుంటాడు. శంకరులవారు చెప్పారు అక్కడ రక్త మాంసముల ముద్ద తప్పితే అక్కడ నేమీ లేదన్నారు. ఎందుకు దాని కోసం అక్రమ అన్యాయాలు చేస్తున్నావు ? నిజంగా మనం ఎలా ఉండాలంటే ఏ స్త్రీని చూచినా తల్లిని చూచిన భావన రావాలి. ఇదే మనకు మన పూర్వీకులు బోధించారు.

" మాతృవత్ పర దారేషు
పర ద్రవ్యేషు లోష్టవత్
ఆత్మవత్ సర్వభూతేషు
యః పశ్యతి సః పశ్యతిః

స్త్రీని చూస్తే మాతృభావన రావాలి తప్ప వేరు భావన వచ్చిందంటే వాడు అత్యంత నికృష్టుడు, పాపాత్ముడు. రామాయణంలో ఇటువంటి ఉదాహరిణ ఒకటి చూడవచ్చును. సీతాపహరణ జరిగిన తరువాత శ్రీరాముడు అత్యంత దుఃఖంతో విలపిస్తూ (శ్రీరామునికి అసలు దుఃఖం లేదు మానవుడుగా వచ్చాడు కాబట్టి ఆ విధంగా అభినయించాడు) న్న సమయంలో సుగ్రీవునితో మైత్రి కలిగింది ఆ సందర్భంలో ఒక ఆభరణాల మూటను సుగ్రీవుడు శ్రీరామునికి యిచ్చి నీ భార్యవేమో చూడమంటాడు. అప్పుడు రాములవారు ఆ మూటను లక్ష్మణునికి యిచ్చి ఆ నగలు మీ వదినగారివేమో చూడమంటాడు. అప్పుడు లక్ష్మణుడు –

" నాऽహం జానామి కేయూరే
నాऽహం జానామి కుండలే
నూపురే త్వభి జానామి
నిత్యం పాదాభివందనాత్ "

అని అంటాడు ఇది మన సంస్కృతి ఇది మన పూర్వీకుల వర్తన మనం అనుసరించవలసిన ధర్మం ఇది " నాకు వదినగారి ఆభరణాలు తెలియవు నేను ఎప్పుడూ కన్నెత్తి ఆమెను చూచినవాడను కాదు కనుక ఆమె భుజకీర్తులు ఎలా వుంటాయి ? ఆమె కుండలములు ఎలా ఉంటాయనే విషయం నాకు తెలియదు నాకు ఆమె కాళ్ళకున్న అందెలు మాత్రం తెలుసు ఎట్లా అంటే నేను రోజూ ఆమె పాదములకు నమస్కారం చేసేవాడను గనుక " అని అంటాడు లక్ష్మణుడు అది ఎందుకంటే అరణ్యాలకు బయలుదేరి వెళ్ళేటప్పుడు తల్లియైన సుమిత్ర లక్ష్మణునికి ఒక ఉపదేశం చేసి పంపించింది

" రామం దశరథం విద్ధి
మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యామటవీం విద్ధి
గచ్ఛతాత యథా సుఖమ్ "

అయోధ్యను విడిచి వెళ్ళుతున్నావని ఏమీ బాధపడకు. రాములవారే నీ తండ్రి అని తెలుసుకో ! సీతాదేవియే నీ తల్లి అని తెలుసుకో ! రాముడు ఎక్కడ వుంటాడో అదే అయోధ్యయని తెలుసుకో ! అని సుమిత్ర లక్ష్మణునికి బోధించింది అందువలన సీతారాములను తన తల్లిదండ్రులుగా భావించాడు లక్ష్మణుడు ప్రతి రోజూ తల్లికి నమస్కారం చేయాలి గదా ! అందువలన సీతాదేవికి నిత్యమూ పాదాభివందనం చేసేవాడు లక్ష్మణుడు. ఇటువంటిది మన సంస్కృతి వారి కోవలో మనం జన్మించాం వాళ్ళపరంపరలో మనం జన్మించాం.

కనుక మనం కామమును దరికి చేరనీయరాదు. పరుషంగా మాట్లాడటం, హింసచేయటం, కోపం తెచ్చుకోవటం – ఇవన్నీ కూడా ఓర్పు లేనటువంటి మనిషి లక్షణాలు. ఓర్పు అనేది వుంటే వీటికి అవకాశమే ఉండదు ఓర్పు అనేది సాధించి వీటన్నింటినీ జయింనాడు శంకరులవారు. కనుక వీటన్నిటినీ జయించాలంటే ఏకైకమైన మార్గం ఏమిటంటే ... కామ జయానికి వస్తువిచారము, క్రోధజయానికి క్షాంతి. ఈ విధంగా వస్తువిచారము, క్షాంతి అనే సాధనలతో కామ క్రోధాలను జయిస్తాడో, వాడే ఉత్తముడైన వ్యక్తి అని అనిపించుకుంటాడు. వాడు అధర్మాన్ని ఆచరించడు, ధర్మాన్ని ఆచరిస్తాడు. ఈ విధమైన జీవనమును మనం గడపాలి. అప్పుడే మనం మన జన్మను ధన్యం చేసుకున్నవారమవుతాం. సార్థకం చేసుకున్న వారమవుతాం.

( ది 20-12-92 న మచిలీపట్నంలో జగద్గురు శంకరాచార్య (శృంగేరి) వారి దివ్య ప్రసంగము)

# నృగమహారాజు

_మల్లాప్రగడ శ్రీరంగారావు

ప్రాచీనకాలంలో భూమండలాన్ని పరిపాలించిన రాజులలో నృగుడను మహారాజుండెను. అతడు ప్రజలను కన్నబిడ్డలవలె దయతో పోషిస్తూ దాన ధర్మాలు చేస్తూవుండేవాడు. ఇంటికి వచ్చిన అతిథులను ఆదరించి ధన, ధాన్య, సువర్ణ, భూ, గోదానములచే వారిని సంతృప్తిపరుస్తూ వుండేవాడు. ఒకనాడు ఒక పర్వకాలమున సదాచార సంపత్తి గల బ్రాహ్మణుని పిలిచి పూజించి పుష్కలంగా పాలిచ్చే బలిసివున్న గోవును దానంచేసాడు. ఆ విప్రుడా గోవును తన వెంట తీసుకొని పోయి మేపుకొనుచు సంతృప్తిచెందాడు. ఒకనాడు ఆ గోవు పొలములో మేయుచు నృగమహారాజు గో సమూహములో చేరింది, ఇంటికి వచ్చిన గోవులతో పాటు ఆ గోవును కూడా పోషిస్తూ కాలం గడుపుచుండగా మందలో కలిసి వచ్చిన ఆ గోవును గుర్తింపలేని ఆ నృగరాజు ఒక పర్వకాలాన ఒక పేద విప్రునికి దానంగా సమర్పించాడు.

కొన్నాళ్ళకు మొదట దానం తీసుకొన్న బ్రాహ్మణుడు తనకిచ్చిన ఆవును వేరొక బ్రాహ్మణుని వద్ద వుండటం చూచి, ఆ రాజే అతనికి దానమిచ్చినట్లు తెలిసికొని ఆగ్రహంతో నృగుని వద్దకు వెళ్ళి "మహారాజా! నాకిచ్చిన ఆవును మరొకనికి దానం చేయడం ధర్మమేనా? నా ఆవును నా కొసంగుమని కోరాడు. ఆ మాటలకు రాజాశ్చర్యపడి "మహాత్మా! తెలియక చేసిన నా అపరాధమును క్షమింపుము. మీకు దానము చేసిన 'ఆవు' అని తెలియక మరొకరికి దానమిచ్చితివి. ఆ గోవునకు బదులుగ వేయి ఆవులను మీకు సమర్పిస్తాను. శాంతించి నన్ను క్షమించండని ప్రార్థించాడు. ఎంత బ్రతిమిలాడినా ఆ బ్రాహ్మణుడంగీకరించనందున, రెండవసారి దానమిచ్చిన వానివద్దకు వెళ్ళి "విప్రోత్తమా! మీకిచ్చిన ఆవు ఇంతకుముందే ఒక విప్రునికి దానమియగా అది తప్పించుకొని వచ్చి మా ఆలమందలో కలిసినందున నేను గుర్తింపలేక ఆ ఆవునే మరల మీకు దానమిచ్చుట జరిగినది నా పొరపాటును మన్నించి ఆ గోవును నాకిప్పించండి. దానికి బదులుగ వెయ్యి మంచి గోవులను మీకు సమర్పిస్తానని ప్రార్థించాడు. కాని అతడు వినలేదు. ఆవును దానము తీసుకొన్న బ్రాహ్మణులిరువురు ఆ గోవే కావాలని, అది చాల మంచిదని, దానికి వేయి గోవులైనా సాటిరావని పట్టుబట్టి రాజును తూలనాడారు రాజు చేసేది లేక తన తప్పిదానికి బాధపడుచు వారిరువురకు నమస్కరించి వెళ్ళాడు.

కొంతకాలానికి నృగమహారాజు మరణించాడు. యమధర్మరాజు నృగమహారాజును చూచి 'రాజా! నీవు చాల పుణ్యకార్యాలు చేసావు. కాని అజ్ఞానం చేత విప్రుని గో ధనం స్వీకరించిన దోషం నీకు సంక్రమించింది. అది అల్పమే. నీ పుణ్యఫలం చాల గొప్పది. ఈ రెండింటి ఫలితాలలో ఏది ముందుగ నీవు అనుభవించాలనుకుంటున్నావ' ని ప్రశ్నించాడు. దుష్కర్మ ఫలమే ముందుగా అనుభవిస్తానని రాజన్నాడు. మరుక్షణమే పెద్ద తొండయై నేలపైపడ్డాడు ధర్మదేవత వానితో "కొన్నాళ్ళకు శ్రీకృష్ణునివల్ల నీకీ రూపం పోయి ఉత్తమ లోక ప్రాప్తి సంభవిస్తుదని చెప్పి మాయమయ్యెను. * ఈ భారతగాథవల్ల ఒకరికి దానం చేసిన వస్తువును తాను తీసికొనుట అపచారమని, ఒకరికిచ్చిన వస్తువును మరొకరికిచ్చుట మహా దోషమని తెలిసికొని జాగరూకులై ప్రవర్తించాలని మనం గ్రహించవలయును *

# నారదభక్తి సూత్రాలు-29

# సోపానపాళి

'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

**78 సూ. అహింసా సత్య శౌచ దయాస్తిక్యాది చారిత్ర్యాణి పరిపాలనీయాని**

భక్తుడు నిరంతరం సత్ప్రవర్తనతో అహింస సత్యం శౌచం దయ ఆస్తికత మొదలైనవి ఆచరించాలి

భక్తి ప్రవృద్ధం చేసే సూత్రాలు నియమాలు చాలా ఉన్నప్పటికీ అందులో ఈ ఐదు అత్యంత ముఖ్యం. దైవీ గుణాలు సామాన్యుణ్ణి మహనీయుణ్ణి చేస్తాయి " భజన చేస్తే కీర్తనం చేస్తే సర్వపాపాలు పోతాయి భజన చేస్తూ ఎన్ని పాపాలు చేసినా ఫరవాలేదు. శీలం ఎలా ఉన్నా భగవన్నామం జపిస్తూంటే పుణ్యాత్ములు అవుతారు" అనేవారు కొందరున్నారు. అది పొరపాటు. హృదయపూర్వకంగా భజన చేసేవాడు శీలం భంగమయ్యే పాపాలు చేయడు. వెలుగు ఉన్నచోట చీకటికి ప్రవేశమే లేదు. దైవీ సంపద గల భక్తి ఉంటే సత్ప్రవర్తన అదే వస్తుంది.

మహామహులైన భక్తుల విషయంలో బాహ్యాచారాలను సామాన్య లౌకిక ధర్మ ప్రమాణాలతో తూచరాదు. వారు సమర్థులు, నిగ్రహానుగ్రహ దక్షులు

ఈ ఐను గుణాలు పాటించని వారిని సాధువులనీ, భక్తులనీ అనడానికి సందేహమే వెలుగు పోగానే చీకటి క్రమ్మినట్లు దైవీగుణాలు కనుమరుగైతే అసురీ గుణాలు క్రమ్ముకొని వస్తాయి. శీలం భక్తుని జీవన మూలం.

అహింస - అంటే మాటలతోగాని చేతలతోగానీ ఏ ప్రాణినీ హింసించరాదు. అన్ని జీవులకు సుఖం కలిగే కార్యాలు చేస్తూండాలి. 'లోకాస్సమస్తా స్సుఖినో భవంతు' ఇలా అయితే మానవ జీవనం సాగుతుందా ! భక్తుడు మాత్రం ఇలా ప్రవర్తించగలడా ! అంటే భారతంలో ధర్మవ్యాధుడు కౌశికమునికి ధర్మసూక్ష్మం వివరించాడు.

హాలికుడు వ్యవసాయం చేస్తున్నప్పుడు ఎంతో జీవహింస తప్పనిసరిగా జరుగుతోంది పంచభూతాత్మకమైన ఈ జగత్తులో అంతట జీవుల సంచారమే కదా! కాలుకదిపితే ఉచ్ఛ్వాస నిస్వాసాలు జరిపితేనే కొన్ని సూక్ష్మజీవులు మరణిస్తాయి కనుక హింస చేయకుండ దేహయాత్ర సాగదు అహింసావ్రితస్థులకు కూడా ఏ కొద్దిగానో హింస చేయక తప్పదు. సాగదు. అయితే సాధ్యమైనంత వరకు ఆత్మపరిశీలనతో హింసకు దూరంగా ఉండటమే అహింస అన్నారు.

హింస సేయని వాడు లేడీజ్జగమున
ఒక్కడైనను- తమ తమ యోపినట్లు
హింస తెరువున కెడగల్గి యేగవలయు
అదియసూవె ! అహింస నా నతిశయిల్లు

సత్యం-సత్యం అంటే ఉన్నదున్నట్లుగా చూచింది చూచినట్లుగా విన్నది విన్నట్లుగా పలుకుట అనేది సర్వజన విదితం. సత్యం గొప్పదనాన్ని శకుంతల చేత ఇలా చెప్పిస్తాడు నన్నయభట్టారకుడు.

నుత జల పూరితంబులగు నూతులు
నూరిటి కంటె సూనృత
వ్రత ! ఒక బావిమేలు-మరిబావులు
నూరిటి కంటె ఒక్క-సత్

కతువది మేలు-తత్క్రతకంబున
కంటె సుతుండు మేలు.త
త్సుత శతకంబుకంటె ఒక సూనృత
వాక్యము మేలు-సూడరన్
వెలయంగ అశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలన్
తులనిడి తూపగ సత్యము
వలనను ములు సూపు గౌరవంబున పేర్మిన్

నూరు నూతులను త్రవ్వించటం కంటె ఒక పెద్ద దిగుడు బావి మేలనీ, అటువంటి నూరు బావుల కంటె ఒక యజ్ఞం మేలనీ, అట్టి యజ్ఞాలు నూరుకంటె ఒక సుతుడు మేలనీ, అట్టి సుతులు నూర్గురు కంటె ఒక సత్యవాక్యం మేలనీ ఇందు విదితమయింది. వేయి అశ్వమేధ యాగాల ఫలితంకంటె ఒక్క సత్యవాక్య బలం గొప్పది- అంటుంది శకుంతల నిండు సభలో దుష్యంత మహారాజుతో.

సత్యం గొప్పదే. అది ద్వేషరోషాసూయాలకు అతీతంగా కల్యాణకరంగా పలకాలి. అది హితంగా ఉండాలి. కటువైన సత్యం పలకవద్దు అన్నారు కొందరు మునీంద్రులు.

ధర్మవ్యాధుడు కౌశికునికి ధర్మ రహస్యాలు చెప్తూ ఇలా అన్నాడు.

భూతహితంబుగాఁ బలుకు బొంకును
సత్యఫలంబునిచ్చు ద
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు
సత్యము బొంకునట్లు; ప్రా
ణాతురుడైనచో, పరిణయంబున యందును,
బల్కు బొంకు స
త్యాతిశయంబయంద్రు; మహితాత్మక
యిట్టివి ధర్మసూక్ష్మముల్

## దీనబంధు

కదలకుండ యుండి కదిలియార్తుల బ్రోచు
దివ్యలీల జూపు దేవ దేవ
ఆర్తిబాపు దేవ ఆగ్య సనాతన,
దివ్య ప్రభల వెల్గు దీనబంధు !
పండి యుండు వంట నిండి జగములన్ని
దండి నిచ్చి జనుల దనుపుదంట
వెండి కొండ దొరవు వేంచేసినావంట
దివ్య ప్రభల వెల్గు దీనబంధు!
దీనజనులను గావంగ దేవ దేవ
తరలి వచ్చియు భక్తుల తనివి దీర
దివ్యలీలలు ప్రకటించు దేవసాయి!
దివ్యప్రభల వెల్గొందు దేవదేవ !

— గుడిశేవ నరసింహారావు

సారాంశం-భూతకోటికి హితంగా పలకాలి. భూత కోటికి హితంగాని సత్యం పలుకవద్దు హితం కలిగే టప్పుడు అబద్ధం ఆడినా తప్పులేదు. పుణ్యం వస్తుంది అని.

శుక్రనీతి ఇంకా ఇలా ఉంది.

వారి జాతులందు వైవాహికములందు
ప్రాణ వి త్తమాన భంగమందు
చకిత గోకులాగ్రిజన్మ రక్షణమందు
బొంకవచ్చు అఘము వొందదధిప !

అయినా బలిచక్రవర్తి "తిరుగన్ నేరదు నాదు జిహ్వ" "విరయంబైన నిబద్ధమైన" ఏది వచ్చినా పలికి బొంకరాదు అని ఆత్మనివేదనం చేసుకున్నాడు. తనకు హాని కలిగినా పరులకు హాని కలుగకుండ సత్యం పలకాలి అనేది తాత్పర్యం

( సశేషం )

# “అశ్వత్థం సర్వవృక్షాణాం”

డా॥ రాపర్ల జనార్ధనరావు

విజ్ఞులైన మహర్షులు మహారణ్యాలలో నివసించుచూ ఆత్మసాక్షాత్కార సాధనలతోపాటు, బాహ్యవాతావరణ, పరిశోధనలలోకూడ నిమగ్నులై, వృక్షములు, నక్షత్రములు, నదులు, జంతువులు మొదలైన వానినిగూర్చిన· తీక్షణమైన పరిశోధనలు సల్పుట ప్రశంసనీయము అవియే మన ప్రాచీన సంస్కృతి అందించిన పెన్నిధి

చెట్లలో రావిచెట్టు, మర్రిచెట్టు, ఉసిరిచెట్టు, అరటిచెట్టు, తులసి, కొబ్బరి, మున్నగు వృక్షముల ప్రాశస్త్యము గ్రహించి వాటి విశేషములను మనకు పారంపర్యముగ అందించియున్నారు. వృక్షములను పూజించుట మన ఆచారము, కార్తీకమాసమున ఉసిరిచెట్టు పూజిస్తాము. దానినే ఆమలకం అంటాము. వేప, రావిచెట్లు కలసియున్నవాటిని పూజిస్తాము.

వృక్షములలోకెల్ల పవిత్రమైన వృక్షము రావిచెట్టు· 'అశ్వత్థవృక్షమే నేను' అని భగవద్గీత 10_28 లో విభూతియోగమున శ్రీకృష్ణపరమాత్మ తెల్పియున్నారు. రావిచెట్టు శ్వేతకాండము కలిగి చక్కని ఆకారము కలిగిన ఆకులతో కళకళలాడుట, ప్రకృతి ప్రియులకెల్లరకు విదితమే. దీనిని హిందీలో 'పీపల్' అని పిలుస్తారు. ఏనుగులకు ఇష్టమైన పత్రములు కలిగినది గనుక 'గజానన', పిప్పల అనికూడ పిలుస్తారు. బోటనీశాస్త్రంలో దీనిని 'Ficus Religiosa' అంటారు. 'బోధి' వృక్షమని కూడ వ్యవహరిస్తారు. బుద్ధునకు జ్ఞానోదయము కలిగినది ఈ వృక్షము క్రిందనే అని చెపుతారు. భారతరత్న బిరుదు రావిఆకు ఆకారమున ప్రదానము చేయబడుట గమనీయము పితృకార్యాలలో హోమంలో సమిధలుగా రావికొమ్మలు అగ్నిదేవునికి సమర్పించుట ఆచారము. అనగా ఈ రావిపుల్లల వలన జనించిన ధూమాగ్ని పవిత్రము, ఆరోగ్యకరమని తెలిసికొనగలము. రావిచెట్టు క్రింద ధ్యానము చేసిన ఏకాగ్రత లభించునని పెద్దలు చెబుతారు. హరిద్వారములో పెక్కుచోట్ల ఈ చెట్లు కన్పిస్తాయి శ్రీలంకకు. అశోకుని చెల్లెలు ఈ చెట్లు తీసికొనివెళ్ళినటుల చరిత్ర చెబుతోంది. విష్ణుపురాణంలో రావిచెట్టునందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, కలిసియున్నారని తెల్పబడి వున్నది.

అనేక ఔషధములుగ దీనిని ఉపయోగిస్తారు. దీని బెరడురసం పుక్కిలించిన నోటి పూత, నివారిస్తుంది. రావిచెక్క కాల్చిన బూడిద అగ్నిమాంత్యము, (ఆకలిలేమి) తొలగిస్తుంది. రావిపండ్లు కడిగి కోసి, తుడిచి పంచదార కలిపి తినిన స్త్రీలకు సంతానయోగ్యత, పురుషులకు వీర్యవృద్ధి కలుగునని శాస్త్రము తెల్పుచున్నది. అయితే రావిచెట్లు దొడ్లలో ఉండరాదు. దేవాలయములు, తటాకములవద్ద దీనికి యోగ్యమైన స్థలము.

“ వృక్షములలో రావిచెట్టును నేనే ” అని శ్రీకృష్ణపరమాత్మ తెలిపిన వాక్యము ఎంతయు గమనీయము ∗

## చందాదారులకు మనవి

- చందా పంపేటప్పుడు కొత్త చందా? లేక పాత చందా? వివరంగా తెలుపవలెను.
- పాత చందా అయితే చందా నెంబరు పేర్కొనవలెను.
- సమాధానం కోరేవారు Reply Card వ్రాయవలెను.

ఋషుల చరిత్రలు – 12

# కశ్యప మహర్షి

-పురాణపండ 'శ్రీచిత్ర'

పూర్వకాలమున కర్దముడను మహర్షిఉండెడివాడు ఆయన కుమార్తెయైన కళను మరీచి మహర్షికిచ్చి వివాహము చేశాడు. భార్యాసమేతుడై మరీచిమహర్షి తపోవనములకేగి సుఖంగా జీవిస్తున్నాడు. కొంతకాలమునకు కళ గర్భవతి అయినది మగ శిశువును కన్నది. ఆ శిశువునకు కశ్యపుడని నామకరణం చేశారు. కశ్యపుడు పెరిగి పెద్దవాడైనాడు. దక్షప్రజాపతి తన కుమార్తెలైన అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, ముని, కపిల, క్రోధ, ప్రధ, క్రూర, వినత కద్రువలను యిచ్చి వివాహం చేశాడు. కశ్యపుడు భార్యలందరితో సుఖంగా జీవిస్తున్నాడు.

అదితి కశ్యపుని కృపచే ద్వాదశాదిత్యులను కన్నది. దితి హిరణ్యాక్ష హిరణ్యకశిపులను కన్నది. దనువు శంబరాది దానవులను కన్నది. కాల క్రోధాదులను కన్నది. అనాయువు నల్గురును కన్నది. సింహిక రాహువును కనగా ముని గంధర్వులను కన్నది. కపిల గోగణమును, బ్రాహ్మణులను, మేనక ఘృతాచి మొదలైన అప్సరసలను ప్రసవించింది. క్రోధ గణములను కన్నది ప్రధ సిద్ధులను, క్రూర చంద్రహంత్రాదులను కన్నది. వినత ఇద్దరిని, కద్రువ నాగులను కన్నారు. ఈ విధముగ కశ్యపుని సంతతి పెరిగింది.

పరశురాముడు అశ్వమేధయాగము చేసి తన అధీనమందున్న భూమిని కశ్యపునకు దక్షిణగా యిచ్చాడు. నాటినుండి భూమి " కాశ్యపి " అని పిలువబడసాగింది. మహర్షుల కోరికపై కశ్యపుడు తపస్సు చేసి శివుని మెప్పించి గంగను భూలోకమునకు తీసుకొనివచ్చాడు. దానిని 'కాశ్యపి' అని పిలిపించారు. ఆ కాశ్యపి నాలుగు యుగాలలో వరుసగా కృతవతి, శిరి కర్ణిక, చందన, సాభ్రమతి అను పేర్లతో విఖ్యాతి చెందింది.

భూదేవి కోరికపై కశ్యపుడు తన ఆధీనమునయున్న భూమిని రాజులకిచ్చి పాలించమని అభిషిక్తులను చేశాడు. బలిచక్రవర్తి బల గర్వితుడై దేవతలను బాధించసాగాడు ఇంద్రాదులు భయపడి పారిపోయి దాగికొనిరి అదితి తన బిడ్డల కష్టాలు వివరించి, కశ్యపునకు దెలిపి బలిని సంహరించే ఉపాయం చెప్పమన్నది. నారాయణుని ఉపాశించమని పలుకగా అదితి శ్రీహరిని ఉపాసన చేసినది. హరి ప్రత్యక్షమై అదితి గర్భాన జన్మించి బలిని సంహరించెదనని పలికాడు. అదితి గర్భం ధరించింది. కొంతకాలమునకు ఒక కుమారుని కన్నది ఆ పుట్టిన బిడ్డకు వామనుడని పేరు పెట్టి పెంచుకొనసాగిరి. ఆ వామనుడే బలిని మూడడుగులు ధానమడిగి బలిని పాతాళానికి పంపాడు. బలి బాధ తీరిపోవడంతో దేవతలు ఆనందించారు. వినత కూడా కశ్యపుని పొందగోరి ఆశ్రమమునకు రాగా, మరో భార్య కద్రువతో సరససల్లాపాలాడుతున్న పతిని చూచి, సహించలేక, వారిద్దరిని నరులైపుట్టమని శపించింది. వారే దశరధ కౌసల్యలుగా జన్మించారు. అనంతరం ద్వాపరయుగాన ఆ కశ్యపుడే వసుదేవుడై జన్మించాడు కశ్యపునకు దితి వలన మరుద్గణం కూడా జన్మించింది. మరుద్గణం ఇంద్రుని మిత్రులుగా, వ్యవహరింపసాగారు.

కశ్యపుడు తన భార్యలకు జ్ఞానబోధ చేశాడు. అనంతరం తపస్సుకు వెళ్ళిపోయాడు. కశ్యపుని పేర కశ్యపస్మృతి యను ధర్మశాస్త్రము కలదు. కశ్యపుడు క్షమాశీలి, కశ్యపుని దృష్టిలో క్షమకున్న ప్రత్యేకత దేనికీలేదు.

# కొంపరగిరి

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 17-11-19 6

చిరంజీవులకు - ఆశీస్సులు

విద యొక్క ఔన్నత్యాన్ని, గొప్పతనాన్ని గురించి గత రెండు లేఖలలో వివరించాను. ఈ చరాచర సృష్టిలో విద్యావంతుని మించినవారు ఎవ్వరూ లేరనే విషయం సుస్పష్టం. విద్యావంతునికి సాటికాగల వారు కూడా లేరు అన్నిటికంటే విద్యయే అధికమని ఈ క్రింది శ్లోకము ప్రపంచానికి చాటుచున్నది

" విత్తం బన్ధుర్వయః కర్మ
విద్యాభవతి పఞ్చమీ
ఏతాని మాన్య స్థానాని
గరీయో యద్యదుత్తరమ్ "

అనగా "ధనము, బంధువు, వయస్సు, కర్మ, విద్య - ఈ ఐదు గౌరవించదగినవి. ఇందు వరుస క్రమములో అనగా ధనము కంటే బంధుత్వము, దాని కంటే వయస్సు, దానికంటే కర్మము, దానికంటే విద్యయు శ్రేష్ఠమైనది " అని అర్థము.

"ధనమూలం మిదం జగత్ '' అన్నారుగదా ! ఈ లోకంలో సహజంగా సామాన్యులచేత ధనము గౌరవించబడుతున్నది. ఎప్పుడైనా, ఎక్కడైనా ధనవంతునికి, బంధుత్వానికి మధ్య పోటీ వస్తే సామాన్యులు సహజంగా ధనవంతుడినే వరిస్తారు ఇంగిత జ్ఞానం గల వివేకవంతులు మాత్రం బంధుత్వానికి విలువయిస్తారు. అసలు బంధుత్వం అంటే ఇక్కడ ఒక చుట్టరికం లేక రక్తసంబంధం అని మాత్రమే కాదు. ఒక్క సుఖములోనే కాక, కష్టములలో కూడా దూరం కాకుండా, ఆత్మీయతతో, అనురాగంతో, అంటి పెట్టుకొని, మనస్ఫూర్తిగా మమకారాన్ని వెదజల్లేవారిని మాత్రమే 'బంధువులు' అని చెప్పుకుంటే బాగుంటుంది. ఇకపోతే అటువంటి బంధుత్వానికి, వయస్సుకు మధ్య వైరుధ్యం వస్తే, సహజంగా సామాన్య మానవులు బంధుత్వానికే విలువయిస్తారు. వయస్సు మళ్ళినవారిని ఏమాత్రం గౌరవించరు. కాని విచక్షణాజ్ఞానం, లౌకిక జ్ఞానం గలవారు మాత్రం వయస్సుకు ప్రాధాన్యత యిస్తారు. ఇక్కడ వయస్సు అంటే కేవలం సంవత్సరములు అని అర్థం సరిపోదు. వయస్సుతోపాటు బుద్ధి కూడా వికసించటం అని అర్థం. వయోవృద్ధుడంటే జ్ఞానవృద్ధుడని, విచక్షణాజ్ఞానం కలవాడని యిక్కడ అర్థం చెప్పుకోవాలి. ఒకవేళ వయస్సు కర్మల మధ్య వైషమ్యం ఏర్పడితే అతి సహజంగా వయస్సుకే విలువ యిస్తారు సామాన్యులు. కర్మను గుర్తించరు. కాని కొంతమంది విజ్ఞులు మాత్రం 'కర్మ' కు ప్రాధాన్యతనిస్తారు. కర్మ అంటే యిక్కడ కేవలం వట్టి పని అని చెప్పుకుంటే సరిపోదు. కర్మ అంటే 'సత్కర్మ' అనగా మంచి పని అని అర్థం అనగా శాస్త్ర సమ్మతమైన పని అని అట్టిదానిని నిష్కామబుద్ధితో, ఫలాపేక్ష లేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరించేటటువంటి పవిత్ర కర్మ అని అర్థము. అట్టి కర్మ, విద్యలలో దేనిని నిర్ణయించుకుంటే బాగుంటుందో, ఒక్కొక్కప్పుడు చెప్పడం కష్టమే అవుతుంది కాని అటువంటి సందిగ్ధ పరిస్థితి ఉత్పన్నమైనప్పుడు సామాన్య ప్రజానీకం " కర్మ " కే విలువయిస్తుంది. కాని అనుభవజ్ఞులు, పెద్దలు, శాస్త్ర పరిజ్ఞానం గల అనుభవశాలురు విద్యకే ప్రాధాన్యతనిచ్చి గౌరవిస్తారు

కారణం ఏమిటి ? ఇక్కడ "విద్య" అంటే కేవలం చదవటం, వ్రాయటం అని భావం కాదు జ్ఞాన విజ్ఞానములను సముపార్జించి పెట్టేదని, లౌకికజ్ఞానం, అనుభవ జ్ఞానం, విచక్షణా జ్ఞానం, వివేకజ్ఞానం, శాస్త్రపరిజ్ఞానములను సంపూర్ణంగా సంపాదించి యిచ్చేదని అర్థము చెప్పుకుంటే బాగుంటుంది. ఆఖరికి దీనివిబట్టి చూస్తే విద్యతో సమానమైనది ఈ ప్రపంచంలో మరేదీ లేదనే విషయం స్పష్టమవుతున్నది.

ఈ సందర్భమున భర్తృహరి సుభాషితములలోని ఈ క్రింది నీతి పద్యమును వ్రాస్తున్నాను దీనిని బాగా అర్థం చేసుకొని కంఠస్థం చేయాలని నా కోరిక.

"విద్య నిగూఢ గుప్తమగు విత్తము
రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు
విదేశ బంధుడున్
విద్య విశిష్ట దైవతము విద్యకు
సాటి ధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము
విద్యనెఱుంగనివాడు మర్త్యుడే"

విద్యయే పురుషునికి మంచిగా ప్రకాశింపజేయునట్టి రూపమువంటిది. మానవునకు విద్యయే గొప్ప సౌందర్యము. పరులెవ్వరికి తెలియకుండా, రహస్యంగా, మిక్కిలి పదిలంగా దాచిపెట్టుకోవటానికి వీలైన ధనము లాంటిది. సమస్త భోగభాగ్యములను, కీర్తి ప్రతిష్ఠలను సుఖసౌకర్యములను కలుగజేయునదియూ విద్యయే. విద్యయే గురువులకు కూడా గురువు. దేశాంతరముకు పోయినప్పుడు, బంధువులవలె వెన్నంటి మిక్కిలి ఉపయోగపడునదియూ విద్యయే. విద్య పరమాత్మవలె మోక్షమును, ఇష్టదైవమువలె ఐహికాముష్మిక ఫలములను కూడా యిచ్చును. రాజులచేత పూజింపబడేటట్లు చేసేది కూడా విద్యే. సభలోని వారందరిని వశపరచుకోగల శక్తి విద్యలోనే ఉన్నది రాజసభలయందు సన్మానాలను లభింపజేసేది కూడా విద్యే. ఈ లోకమున సుఖశాంతులతో సౌఖ్యవంతముగా జీవితమును గడుపుటకు మంచిగా ఉపకరించేది కూడా విద్యే. విద్యకన్నా అధికమైన ధనం మరొకటి ఈ లోకంలో ఏదీ లేదు. అట్టి ఉత్తమోత్తమమైన, పరమోత్కృష్టమైన, వివేక విజ్ఞానాదులను, గౌరవప్రతిష్ఠలను, స్వాగతి సన్మానాలను సంపాదించి పెట్టేటటువంటి విద్యను అభ్యసించడం ప్రతివాని కర్తవ్యం, ధర్మం. అట్టి విద్యనభ్యసించనివాడు పశువుతో సమానము అంతేకాదు అటువంటి సోమరిని అవివేకుడని, కర్తవ్యా కర్తవ్యముల నెరుగని వివేక శూన్యుడని, సర్వత్రా భావిస్తారు. కనుక అన్నిటికన్నా మిన్నయైన, సర్వసమ్మతమైన విద్యను శ్రద్ధగా, మీరందరూ అభ్యసించి వివేక విజ్ఞానాదులను సముపార్జించుతారని ఆశిస్తున్నాను

ఈ క్రింది ప్రశ్నలకు ఆలోచించి సరియైన సమాధానాలు వ్రాస్తారుగదూ !

1. మన రాష్ట్రంలో కృష్ణానదీతీరంలో వున్న పుణ్యక్షేత్రములు ఏవి ?
2. తిరుమల తిరుపతి ఏ జిల్లాలో ఉన్నది ?
3. మన తెలుగు దేశమునకు 'త్రిలింగదేశం' అని పేరు ఎలా వచ్చింది ?
4. బౌద్ధమతమును స్థాపించినదెవరు ? అతని అసలు పేరు ఏమిటి ?
5. శిక్కు మతమును స్థాపించినదెవరు ?
6. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత రాష్ట్రపతి పదవిని అలంకరించినవారెవరు ?
7. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రధానమంత్రి పదవిని అలంకరించినవారెవరు ?
8. శివాజి గురువుపేరు? ఆయన ఆరాధ్య దేవతపేరు?
9. కాకతీయ సామ్రాజ్య ముఖ్య పట్టణం ఏది ?
10. హైద్రాబాద్‌కు మరొక పేరు ఏమిటి ?

ఉత్తరాలు వ్రాసేటప్పుడు మంచిగా, అర్థం అయ్యేట్లుగా మంచి దస్తూరితో వ్రాయాలి. ఇక ఉంటా ...

ఇట్లు 'మీ నాన్న'

# ఆహారం సాత్త్వికం

అతిగ భాషించు వాచాలత్వమధికమయ్యె
కార్యకారకత క్షీణమై కరిగిపోయె
బ్రతుకు బాడంబరాలతో భారమాయె
నేటి విద్యార్థి బ్రతుకిపాటిదాయె

విద్యార్థులారా! విద్యార్థినులారా!

అన్నింటికన్నా ముందు దేహమునకు కావలసిన శారీరక, మానసిక, ఆధ్యాత్మిక బలములు తగిన రీతిగా వుండాలి. 'కర్మానుబంధీని మనుష్యలోకే' మానవుడు కర్మ చేత బంధింపబడినవాడు. కర్మకు మూలకారణము కాయము కనుక దేహము పుష్టిగా సంతుష్టిగా వున్నప్పుడే మానవుడు యీ జగత్తునందు అన్ని కార్యము లందు విజయము సాధించగలడు. దీనిని పురస్కరించు కొనియే స్మృతి 'దేహానుబంధీని మనుష్యలోకే' 'ధర్మార్థ కామ మోక్షాణాం ఆరోగ్యం మూల ముత్తమమ్' 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధకమ్' అని చెప్పుతూ వచ్చింది. అనగా సర్వ ధర్మములు ఆచరించవలెనన్న శరీరము మొట్టమొదట తగిన స్థితిలో వుండాలి.

## సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ

మానవుడు భుజించు ఆహారము ఎట్టిదో దానిని పురస్కరించుకొనియే మనస్సు వుంటుంది. ఈ సంకల్పములు పురస్కరించుకొనియే ఆత్మ స్ఫూర్తి ఆవిర్భవిస్తుంది. కనుక ఆత్మ స్ఫూర్తికి ఆహారము అత్యవసరము. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అనగా మూడు కాలములందు మార్పు చెందని ఏ జ్ఞాన మైతే వున్నదో ఆ జ్ఞానమే బ్రహ్మ అని, అట్టి బ్రహ్మ నుండియే ఆకాశము ఆవిర్భవించింది. ఆకాశమునుండియే గాలి పుట్టింది. గాలి నుండియే అగ్ని ఆవిర్భవించింది. అట్టి అగ్ని నుండియే జలము పుట్టింది. ఈ జలము నుండి పృథ్వి, పృథ్వి నుండి ఓషధులు, ఓషధులనుండి అన్నము, అన్నము నుండి మానవుడు ఆవిర్భవించు చున్నాడు. కనుక బ్రహ్మకును, జీవునకును ఉన్న

"రోగములు రాకుండా, భావములు మా
ఆహారం అతి శుద్ధమైనదిగా వుండాలి. అన్ని
ఆహారమే మూలం. కనుక ఈ ఆహారము సా
భగవదర్పితంగాను వుంటుండాలి. Food ఎట్లా
Food, Head, God . ఈ మూడింటికి సంబంధ
టానికి కారణమేమిటి? చెడ్డ ఆహారమే దీనికి ము
దీనికి మూలకారణం. భగవదర్పితం చేయాలి ఆహ
లేక ఎన్ని సాధనలు చేసినప్పటికీ ప్రయోజనం
ప్రాణసమానమైనది. మనం తీసుకొనే ఆహారం
ఆవిర్భవిస్తాయి. పవిత్రీకృతమైనది అయితే మన
సరియైన గమ్యానికి చేరుకోగలుగుతాం.

సన్నిహిత సంబంధ బాంధవ్యాన్ని మనం చక్కగా గుర్తించాలి. ఈనాటి మానవుడు బ్రహ్మనుండియే ఆవిర్భవించినటువంటివాడు. ఆ బ్రహ్మను పొందవలె నన్న యీ పురుషుడు అన్నమయ ప్రాణిగా రావాలి. ఈ అన్నమయ ప్రాణము నుండి ఓషధుల స్థాయికి చేరాలి. ఓషధుల స్థాయినుండి జలస్థాయికి చేరాలి. ఈ జల స్థాయినుండి అగ్ని ఆవిర్భవించాలి. అగ్ని నుండి గాలిగా మారాలి. గాలి నుండి ఆకాశములో

# పవిత్రం అయి ఉండాలి

భగవాన్ సాయి దివ్యప్రబోధ

ప్రవేశించాలి. ఆ పరబ్రహ్మము నుండి ఆవిర్భవించినది.

### ఆనందమయకోశము

కనుక పంచ భూతములతో కూడిన యీ పాంచ భౌతిక శరీరము అన్నమునకు ఆశ్రయమైనటువంటిది అయితే లోకులు యీ అన్నమయ, ప్రాణమయ

---

శరీరం కుంటుపడకుండా, బుద్ధులు కదలకుండా వుంటే నమి త్తం అంటికీ దేహమే మూలాధారం. దేహమునకు సాత్వికమైనదిగను సత్స్వభావతతో ఆరించినదిగను, నాకో Head అల్లా. Head ఎల్లానో God అల్లా. నం వుంటుంది. మానవునికో సద్బుద్ధులు రావ నాలకారణం. సన్మార్గంతో సంపాదించిన ఆహారమే హారమే దీనికి మూలాధారం. సద్భావమైన భావములు లేను. సాధనకు ఆహారం చాలా ఆధారమైనది. సాత్వికమైనది అయితే సాత్వికసద్గుణములు మనలో సత్యమైన భావములు మనలో ఉద్భవిస్తాయి. అప్పుడు

– బాబా

---

దేహమును స్థూలము అని భావిస్తున్నారు. కానీ యీ స్థూలమైన శరీరమునందే అతి సూక్ష్మమైన ప్రాణమున్నది. సూక్ష్మమైన ప్రాణమునందే మనోమయ కోశమున్నది. మనోమయ కోశమునందే విజ్ఞానమయ కోశము మరింత సూక్ష్మముగా వుంటున్నది. విజ్ఞానమయ కోశమునందే ఆనందమయ కోశము అత్యంత సూక్ష్మముగా వుంటున్నది. అన్నమయ కోశమునుండి ఆనందమయ వరకు ప్రయాణించటమే మానవ జీవిత ప్రయాణము. కానీ దురదృష్టవశాత్తు ఈనాటి మానవుడు అన్నమయ ప్రాణమయముల నుండి మనోమయము వరకూ ప్రయాణిస్తున్నాడే గాని విజ్ఞానమయ ఆనందమయ కోశములను విస్మరిస్తున్నాడు. ఈ దేహము విజ్ఞానమయ కోశము వరకు ప్రయాణము సల్పాలి. అప్పుడే మనకు ఆనందమయ కోశము ప్రాప్తిస్తుంది.

### శరీరము ఎప్పుడూ కర్మమయమే

ఈనాటి మానవుడు ఆనందము పొందవలెనని అనేక ప్రయత్నములు సల్పుచున్నాడు. చదవటం ఆనందము కోసం, జీవించటం ఆనందం కోసం, వివిధ విధములైన కర్మలన్నియు ఆనందం కోసం. కానీ బాహ్యమైన వస్తువులయందుగానీ, విషయములందుగానీ ఆనందము కానరాదు. ఆనందమనేది అంతర్భూతమైనది. అట్టి అంతర్భూతమైన ఆనందము నుండియే మన యొక్క భావములు ఆవిర్భవించాలి. ప్రాకృతమైన ఈ ఆనందము లన్నియు అంతర్భూతమైన ఆనందము యొక్క ప్రతిబింబములే. కనుక అనంతమైన ఆత్మస్వరూపమే ఈ ఆనందము ప్రాప్తిస్తూ వుంటుంది. ఒక చిన్న ఉదాహరణము మనము మంటవేసుకుంటాము ఎట్టి మంటయో అట్టి పొగలు తయారౌతుంది. ఎట్టి పొగయో అట్టి మేఘములు ఏర్పడుతాయి. ఎట్టి మేఘములో అట్టి వర్షము కురుస్తుంది. ఎట్టి వర్షమో అట్టి పంటలు పండుతాయి: ఎట్టి పంటలో అట్టి పంట. ఎట్టి పంటనో అట్టి బుద్ధి. ఈ మంట ఏమిటి? మంటనుండియే పొగ ఆవిర్భవిస్తున్నది. కాబట్టి మంట ఏమిటి? కర్మ కౌశలమైన జగద్భూతి యొక్క కర్మ ఫలితమే. దేహము కర్మము. వాక్కు కర్మయే ప్రపంచము కర్మయే

చేతలు కర్మయే. సర్వము మానవుని శరీరమంతయు కర్మమయమైనది

కర్మమయమైన యీ శరీరమునకు ధర్మమయమైన ఆహారము నందించాలి. ధర్మమయమైన ఆహారము ఎట్లాంటిది? సాత్వికమయినదిగను, స్వార్జితము, పవిత్రార్జితమయినదిగను, భగవదర్పితమయినదిగను వుండాలి అప్పుడే మానవుని యందు సాత్వికమయిన గుణములు ఆవిర్భవిస్తాయి మనము భుజించే ఆహారము ధర్మార్జితమయినదిగా వుండాలి అధర్మార్జితమయిన ఆహారము మనలను అధర్మమార్గంలో ప్రవేశపెడుతుంది ఎట్లా ఇది అధర్మ మార్గములో ప్రవేశపెడుతుంది? మనము తిన్న ఆహారము స్థూలరూపములో మలముగా విసర్జిస్తున్నాము. ఇంక సూక్ష్మమయిన ఆహారము మన శరీరములో కండలుగా, రక్తముగా మారుతూవస్తుంది. అతి సూక్ష్మ మయిన ఆహారమే మనస్సుగా మారుతుంది. కనుకనే ఎట్టి ఆహారమో అట్టి మనస్సుగా రూపొందుతున్నది రజోగుణ, తమోగుణ సంబంధమయిన ఆహారములు మనము అమితముగా ఆరగిస్తున్నాము. అధర్మార్జిత మయిన ఆహారము కూడను భుజిస్తున్నాము. పోనీ యిట్టి ఆహారము భుజించే సమయంలో భగవదర్పిత మయినా చేస్తున్నామా? లేదు పోనీ ఆహారము అందినదని మితముగానైనా భుజిస్తున్నామా? లేదు అమితంగా భుజిస్తున్నాము నీరు త్రాగటానికి కూడను స్థానములేదు.

మానవుని జీవితమంతయు, మానవత్వమంతయు తీసుకొనే ఆహారముపైన, త్రాగేనీరుపైన నిలిచివున్నది మనము త్రాగిన నీరు స్థూలరూపంలో మూత్రముగా పోతున్నది. అతి సూక్ష్మమయిన ఈ జలమే ప్రాణముగా మారుతున్నది. కనుక జలము ప్రాణముగా, ఆహారము మనస్సుగా మారుతున్నది. స్థూలమయిన అన్నమయము నందు ప్రాణమయ మనోమయములు పవిత్రమైనప్పుడే విజ్ఞానమయమును అందుకోగలము.

## సాత్వికాహారం

సాత్వికాహారం అంటే ఏమిటి? కారము తక్కువగా వుండాలి ఉప్పు తక్కువగా వుండాలి. చింతపండు తక్కువగా వుండాలి మసాల తక్కువగా వుండాలి. ఇంతేకాక ఇది చాలావరకు తైలముతో కూడి ఉండాలి ఇది Fresh గా వుంటుండాలి చల్లగా వుండకూడదు తెల్లవారి వండినది సాయంత్రము భుజించకూడదు. ఇది అతి సాత్వికమైనది. అనేకమంది సాత్వికాహారమని పాలు, పెరుగు, పండ్లు భుజిస్తూ వుంటారు పాలు, పెరుగు, ఫలములు సాత్వికమే కాని అది మితిమీరిపోతే తామసికంగా మారుతుంది. పెరుగు అని మనం పూరితే భుజిస్తే ఇది తమోగుణంగా రూపొందుతుంది. పాలు కూడను మనం అధికంగా తీసుకోరాదు Milk thick వుంటే మనం తీసుకో కూడదు సగము నీరు సగము పాలుగా వుండాలి. అదృష్టవశాత్తు ఈనాడు Thick గా milk చిక్కటం లేదు వారే నీరు కలుపుకొనివచ్చి సహాయము చేస్తున్నారు. కనుక పాలు, పెరుగు అమితంగా భుజించ రాదు. భుజించే వానికి నిద్ర ఎక్కువగా వుంటుంది నిద్ర తమోగుణము యొక్క తమ్ముడు నిద్ర రాకుండా వుండే ఆహారాన్ని భుజించాలి

అనేకమంది Tea, coffee లు అధికంగా తాగుతూ వుంటారు. ఇది శరీరమందలి నిద్రాశక్తియొక్క తత్వాన్ని చంపేస్తుంది చాలామంది లారీలు, బస్సులు రాత్రిపూట Drive చేసేవారు ఎక్కువ టీ, కాఫీలు తాగుతుంటారు అంతేకాదు పరీక్షలకోసం చదివేపిల్లలు ఎక్కువ టీ తాగుతుంటారు ఇది చాలా తప్పు నిద్ర రాకుండా వుండేదానికి తాగుతున్నారేగాని నిద్ర కూడా మానవునికి ఎంతఉండాలో అంత వుండాలి ఆహారము లేకపోయినా జీవించవచ్చును గానీ నిద్ర లేకపోతే జీవించటం వీలు కాదు కనుక నిద్ర ఎక్కువగా రాకుండా వుండటానికి మనం సరియైన మార్గాన్ని అవలంబించాలి విద్యార్థులకు యింకొక విషయం రాత్రి పది గంటల

తరువాత చదవటం ప్రారంభించకూడదు. చాలామందికి ఒక దురభ్యాసమయి పోయింది. రాత్రంతా చదవటము, తెల్లవారి నిద్రపోవటము. అసలు రాత్రిపూట పశు పక్షి మృగాదులు కూడను నిద్రిస్తూవుంటాయి ప్రకృతి అంత కూడను నిద్రిస్తూవుంటుంది. ప్రకృతి నిద్రించే సమయంలో మేలుకొని వుండేవాడు ఎవడు ? రాక్షసుడు మాత్రమే రాత్రిపూట చదివేవాడు రాక్షసుడే అని చెప్పవచ్చు ఇది కొంతమందికి అలవాటైపోయి వుంటుంది ఈ అభ్యాసమును కొంతవరకు తగ్గించుకోవాలి ఇది రజోగుణ, తమోగుణముల యొక్క చేరిక. రాత్రంతా చదివి తెల్లవారి నిద్రించిన తరువాత చదివిన దంతా పోతుంది నీకంత ఇష్టము వుంటుంటే తెల్లవారి మూడు గంటలకు లేచి చదువుకో! చదువుకున్న తరువాత తిరిగి నిద్రించరాదు ఇది సరియైన సాత్విక పద్ధతి.

## మితాహారం

ఈ పద్ధతిలో మితమయిన ఆహారము వుంటుండాలి. మితము అంటే ఏమిటి ? అమితము అంటే ఏమిటి ? భోజనమునకు మనమేవిధంగా Light గా వచ్చి కూర్చున్నామో అదే విధంగా తిని లేచేటప్పుడు light గా లేవాలి. lightగా వచ్చి కూర్చుని భారంగా లేస్తే అది తమోగుణమయిపోతుంది Stomach ను మనం నాలుగు విధములుగా విభజించాలి. ఇది అందరికి తెలియదు. ఇంకా నేను కొంచెము భోజనం చేయవచ్చు అనేటటువంటి భావమున్నంతవరకే మాత్రం భోజనం చెయ్యాలి ఇంకా పొట్టలో కొంచెం స్థలం వుంది వేస్తాం వేస్తాం అని పూరకే వేయకూడదు. విద్యార్థులు యిది పొట్ట కాని బుట్ట కాదని గ్రహించాలి దీనికి తగిన మితాహారమే వుంటుండాలి ఐతే చిన్న వయస్సులో వుంటుంటారు కనుక మీరు మూడు భాగములు నిండే టట్టుగా భుజించవచ్చు ఒక భాగాన్ని మాత్రం నీరు నింపుకోవచ్చు నాలుగు భాగములు చేయాలని చెప్పాను. ఇందులో రెండు భాగములు ఆహారము. ఒక భాగము నీరు, ఒక భాగము గాలి కానీ ఈనాటి కలియుగ ప్రభావమేమంటే నాలుగు భాగములు ఆహారమే ఇంక జలమునకు యే మాత్రము అవకాశము లేదు శరీర ధర్మాన్ని పురస్కరించుకొని మీరు విచారించాలి భోజనము చేసిన తరువాత Blood పైనుండి క్రిందకు ప్రవహిస్తుంది. అప్పుడు కొంచెము మత్తు ఏర్పడుతుంది. కనుకనే పగటిపూట భోజనము చేసిన తరువాత ఒక పది నిమిషములు Rest తీసుకోవాలి నీవు నిద్ర పోక పోయినప్పటికిని ఒక దగ్గర Rest గా కూర్చోవాలి కానీ రాత్రి మాత్రం భోజనం చేసిన తరువాత కొంత Walk చెయ్యాలి. కనుకనే Walk a while after dinner, sleep a while after lunch అన్నారు ఇది ఆరోగ్యమునకు తగిన భద్రతయిస్తుంది. Lunch అయిన తరువాత స్వామి పండుకొనమని చెప్పారని గంటలు గంటలు పడుకోకూడదు Only five minutes or Ten minutes ఇది సాత్వికంగా వుంటుంది.

## భగవదర్పితము

ఇంక ఆహారము భగవదర్పితంగా వుంటుండాలి. ఎందుకంటే ఈ ఆహారము అంతా కూడను బ్రహ్మ నుండే వచ్చినది కనుక తననుండి వచ్చిన దానిని తనకు అర్పితం చేసి భుజించినప్పుడు సాత్వికముగా అవుతుంది భగవంతునికి అర్పితము చేయకుండా భుజించినప్పుడు అది ఆహారంగా రూపొందుతుంది. ఈ ఆహారములో అనేక దోషాలుండవచ్చును. ఈ కూర గాయలు అమ్మేవాడు ఎక్కడ దొంగిలించి అమ్మినాడో ఆ కూరను తింటే ఆ దోషము కూడను యిందులో వుంటుంది షాపులో నుండి వచ్చిన ధాన్యము మొదలైనవి ఏ రూపములో వచ్చినాయో ఆ దోషము కూడా మనకు వస్తుంది ఏ దోషము ఎక్కడ ఏ విధముగా వుంటుందో తెలియదు కనుక అది భగవదర్పితము గావించినప్పుడు ప్రసాదముగా రూపొందుతుంది కనుకనే.

" బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః
బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం
బ్రహ్మకర్మ సమాధినా "

అన్నారు. బ్రహ్మార్పితమైన ఆహారము లోపల ఎలాంటి దోషము వుండదు

మీరా పరమ భక్తురాలు. ఆమె నిరంతరము ప్రతి పదార్థము భగవంతునికి అర్పితము చేసి భుజించేది. ఈమె మహారాణి కాబట్టి మగవారి మధ్య స్వేచ్ఛగా పాడుకోవటం గాని తిరగటం కాని చేయకూడదు. ఇది ఆనాటి ఘోషా స్త్రీలకున్న నిబంధన అందులో ఈమె మహారాణా భార్య. ఆ రాష్ట్రములో రాణులు ఎప్పుడూ మగవారి మధ్య తిరిగేవారు కాదు. కానీ యీ మీరాకు ఎట్టి భేదము లేదు. ఆమె భావమేమిటి? ప్రకృతి అంతయు స్త్రీయే. కృష్ణుడు ఒక్కడే పురుషుడు కాబట్టి నేను స్త్రీల మధ్య వుంటున్నాను గాని పురుషుల మధ్య లేను అని భావించేది. బుష్‌కోట్లు, ప్యాంట్లు వేసుకోవటం వలన పురుషులనుకుంటున్నారు గాని అందరు స్త్రీలే ఎట్లా? ఇది ప్రకృతి. ప్రకృతి అనగా స్త్రీతత్త్వమే విశ్వ నాటక రంగంపైన అనేక రకములైన వేషములు వేస్తూ వచ్చారు. విశ్వ నాటక రంగములోని వేషాలేయివి గాని మనస్తత్త్వం మాత్రం పురుషులకు స్త్రీలకు సమానమే దుఃఖము వస్తే స్త్రీలు ఏడుస్తారు, పురుషులూ ఏడుస్తారు ఆకలైతే పురుషులు తింటారు, స్త్రీలూ తింటారు. కోపంవస్తే పురుషులు కోప్పడతారు, స్త్రీలూ కోప్పడతారు. కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యములు ఇరువురికి సమానంగా వుంటున్నాయి. కనుక మీరందరు అబలలే మీలో ఎట్టి బలము లేదు. కేవలము భుజబలము బుద్ధి బలము వుండవచ్చును. కానీ గుణబలము యిద్దరికీ సమానమే. కనుక అందరు స్త్రీలే నిగ్రహశక్తి భగవంతునికే వున్నది. కనుక అతనొక్కడే పురుషుడు. అట్టి భావములోపల అక్బరుచక్రవర్తి వచ్చినా, మరొక రాజులు వచ్చినా వారి మధ్య ఆనందముగా కృష్ణుని గానము చేస్తుండేది తన్మయత్వముతో. ఈమె భక్తి ప్రపత్తులకు అక్బరు చాలా ఆనందించాడు. ఆమె యొక్క భక్తిని పురస్కరించుకొని కృష్ణునికి ఒక మాలను వేయమని అతను అర్పితము చేశాడు అక్బరు కృష్ణునికి యిచ్చాడు. కృష్ణునికి యిచ్చినది నాకు వద్దని చెప్పటానికి నాకేమి హక్కు వుంది? సరే తీసుకుంది కృష్ణునికి వేసింది. ఇది మహారాణాకు తెలిసింది. మహారాణాకు అక్బరుకు చాలా ద్వేషము. కనుక ఈమెపై చాలా ద్వేషము పూనుతూవచ్చాడు. ఈమె కృష్ణభక్తి, కృష్ణభక్తి అని స్త్రీపురుషుల భేదమునే వుల్లంఘించి పోతున్నది అని తన తమ్మునితో పాలలో విషము కలిపి ఇమ్మన్నాడు చాలా కఠినమైన విషము. ఒక Drop గొంతులోకి పోతే మరణించే విషము. అట్టి విషమును పాలలో కలిపి Servents తో ఆమెకు యిచ్చి పంపారు. ఆమె ప్రతిఒక్కటి కృష్ణునికి అర్పితముచేసి భుజించేటటువంటిది. కనుక ఈపాలు కృష్ణునికిఅర్పితం చేసి ప్రార్థించి తదుపరి తాను త్రాగటానికి పూనుకుంది. కానీ యీమె మరణించలేదు. కారణం ఏమిటి? ఆ విషము కూడను కృష్ణునికి అర్పితమైపోయింది. కృష్ణుని విగ్రహము నీలవర్ణముగా మారిపోయిందిగాని ఈమెకు ఆ విషము చేరలేదు. అదే విధముగా ఎట్టి పదార్థము భగవంతునికి అర్పితముచేస్తే విషము కూడను అమృతముగా మారుతుంది.

విద్యార్థులారా! మనము హాస్టలులో వున్నంతవరకు మనము ఈ కళాశాలలో చదివేంతవరకు యేదో బలవంతముతోనో, నిర్బంధముతోనో. Force తోనో, యేదో ఒక రీతిగా బ్రహ్మార్పణం అని పెదవులు కదిలిస్తున్నాము. అది కాదు సరియైనది. హృదయపూర్వకముగా మీరు భగవదర్పితము చేయాలి సాత్వికమైన ఆహారము. అట్టి భగవదర్పితము చేయనిఆహారము వలన అనేక రోగముల చేతను అనేక భావముల చేతను మానవత్వాన్ని కోల్పోతున్నాము దీనికి మరొక కారణము. మానవుడు జిహ్వాచాపల్యముచేత రుచికరమైనవి అనుభవించాలని ఆశిస్తున్నాడు. 84 లక్షల జీవ

రాసుల లోపల ఒక్క మానవుడు మాత్రమే ప్రాకృతమైన ఆహారమును మార్చుకుంటున్నాడు ఇంక పశుపక్షి మృగాదులన్నీ సహజమైన ఆహారాన్నే భుజిస్తున్నాయి కనుకనే వాటికి ఎక్కువగా రోగములు రావటంలేదు. జిహ్వాచాపల్యముచేత అనేక రకములుగా దీనినంతా వుడకపెట్టి యిందులో ప్రాణశక్తిని చంపివేసి వట్టి పిప్పిని భుజిస్తున్నాడు మానవుడు. మానవుడు జిహ్వాచాపల్యమునకు లోనయ్యాడు కనుక మనము రుచిని చూడకూడదు. మనము ఔషధము సేవిస్తున్నాము. ఔషధము ఎందుకోసం సేవిస్తున్నాము? రోగనివారణ కోసం సేవిస్తున్నాము. రోగనివారణ లక్ష్యములో వుంచుకోవాలి కానీ డాక్టరు యిచ్చే ఔషధము తియ్యగా వుండాలనుకుంటే వీలుకాదు ఈ ఆహారము కూడను ఔషధము వంటిదే. ఏమిటి ఔషధము? ఆకలి అనే రోగమునకు అన్నము ఒక ఔషధము. దాహమనే రోగమునకు నీరు ఒక ఔషధము ఈ ఔషధములో మనం రుచులెందుకు చూడాలి.

చాతకము కోరునే వేళ చంద్రకాంతి
తుమ్మెద ఆశించు పూవుల చెంతజేర
రోగి కాంక్షించు మందులు రుచిరముగను
పర్తివాసుండు వాంఛించు భక్తజనుల

మానవత్వములో ఒక్కొక్కటి ఒక్కొక్క వాంఛగా వుంటుంది యిదిరుచికరమైనదిగా మనము తినకూడదు. ఐతే అది కూడా వుండవలసినదే లేకపోతే ఎక్కువ మనం తినలేము. అది అనంతకాలమునుండి అభ్యాసమై వచ్చింది అయితే ఎంతవరకో అంతవరకే మనం రుచిని కూడా కోరాలి.

## ఆహార దోషము :

కనుక రోగములు రాకుండా, భావములు మారకుండా, బుద్ధులు కదలకుండా వుండే నిమిత్తమై ఆహారం అతి శుద్ధమైనదిగా వుండాలి. ఐతే యీ ఆహారం అంటే ఏమిటి? పండ్లు, కూరగాయలు, ధాన్యములు యివన్నీ ఆహారమా? కాదు, కాదు. ప్రపంచములో అంతా ఆహారమే. మన దేహమంతా ఆహారమే. ఒక దేహము మరొక దేహమునకు ఆహారముగా వుంటున్నది ఒక ప్రాణి మరొక ప్రాణికి ఆహారముగా వుంటున్నది అన్నమే అన్నమును భుజిస్తున్నది. ఈ దేహము ఏమిటి? అన్నమయము. ఈ అన్నమయ దేహము అన్నమునే భుజిస్తున్నది. కనుక ఆహారమనేది ఎక్కడ వుంటున్నది? అంతా ఆహారమే పశువులు గడ్డిని భుజిస్తున్నాయి మృగములు కొన్ని మృగములను భుజిస్తున్నాయి చేపలను చేపలు భుజిస్తున్నాయి. ఒక ప్రాణము మరొక ప్రాణమునకు ఆహారముగా మారుతున్నది కనుక నీవు తట్టలో పెట్టుకున్నది మాత్రమే ఆహారము కాదు. నీ పొట్టలో వుండినది మాత్రమే ఆహారము కాదు. నీ దేహమంతా ఆహారమే. దేహము ఆహారము కనుకనే యీ ఆహారము మరొక ఆహారము భుజిస్తున్నది. ఈ ఆహారము మరొక ఎలాంటి ఆహారము భుజించాలి. ఈ ఆహారమనే దేహమును అదుపులో పెట్టే ఆహారమునే భుజించాలి ఒక చిన్న ఉదాహరణము. ఈ దేహమనేది ఆహారము. ఈ దేహమనే ఆహారమునకు మత్తుపదార్థము తీసుకుంటే దేహమునే మరచిపోతున్నాము మనము. కనుక యీ ఆహారమును పాడుచేస్తున్నది. ఈ ఆహారము మరొక రజోగుణమయిన మరొక మృగాహారమును భుజిస్తున్నాము మృగాహారము యేమి చేస్తున్నది? మృగభావములను అభివృద్ధిపరుస్తున్నది. ఈనాడు మానవత్వములో మృగత్వము అభివృద్ధికావటానికి కారణం ఏమిటి? దయ, ప్రేమ, సహనము, శాంతి, సానుభూతి అనే యీ హృదయభావములు మానవునియందు లేకపోవటానికి కారణము ఏమిటి? ఈ ఆహారము యొక్క దోషమే దీనికి మూలకారణము. కనుకనే డాక్టర్సు డైట్ కంట్రోలు చేయమంటారు. ఒక చిన్న ఉదాహరణము. ఒక డయబిటిక్ పేషెంటు వుంటాడు. ఈ ఆహారములో అదొక రోగము వుంటున్నది. ఈ

రోగమునకు తగినటువంటి విరుద్ధమైన ఆహారమునే మనము భుజించాలి. చక్కెర, పండ్లు, పిటినంతా భుజిస్తే ఈ ఆహారమునందుండే రోగము ఎక్కువై పోతుంది కనుక యీ ఆహారమును మితముగా తీసుకోవాలి. ఈనాడు ఎక్కడ చూచినా హార్టు జబ్బులు అధికమైపోతున్నాయి ఈ heart జబ్బుకు యేమి కారణమని విచారణచేస్తే చాలామంది డాక్టర్లు ఆహార దోషమంటారు, వివాహ దోషమంటారు ఎన్నెన్నో కారణాలు చెప్పుతారు కాదు. కాదు ఈ heart జబ్బు మూలకారణము Hurry, Worry, Curry hurry (తొందరపాటు) ఎప్పుడు చూచినా Worry. ఈ Worry వలన, Curry. పూరికే భుజించటంవలన, ఈ మూడింటివల్లనే Heart దెబ్బతింటుంది. అన్నింటికి ముఖ్యము మితాహారము ఒక బస్సు లోపల ఎన్ని సీట్లు వున్నాయో అన్ని సీట్లు మాత్రమే నింపినప్పుడు భద్రత ఉంటుంది. దీనికి Over Load వేస్తే కొన్ని చోట్ల పడతారు fine వేస్తారు. కాబట్టి మనం కూడను యీ over load చేయకూడదు. చేసినప్పుడు గుణము అనే పోలీసువాడు వచ్చి పట్టేస్తాడు. లేక అనారోగ్యమనే RTO వచ్చి పట్టేస్తాడు. లేక Break inspector వచ్చి పట్టేస్తాడు. అనగా యింద్రియనిగ్రహము లేకుండా అయిపోతుందన్నమాట. Break inspector అంటే యింద్రియనిగ్రహములనంతా పరీక్షించేవాడు. ఈవిధంగా మన ఆరోగ్యమును మనం పాడుచేసుకుంటున్నాము అమితంగా భోజనము చేయటంవలన ఉన్నత స్థాయికి కూడా పోలేకపోతున్నాము. ఇది చాలా చక్కగా విచారించాలి ఒక Over load లారీ నడవాలంటేకూడా ఏడుపుఏస్తు ది ఊర్ధ్వగతికి పోవాలనుకుంటే ఈ దేహమనే లోడ్ అయిన లారి చాలా బాధపడిపోతుంది ఈ బాధ లోపల బ్రేకు పనిచేయకపోతే క్రింద కూలిపోతుంది.

## మనస్సే ప్రధానం

కనుక శరీరమనేది ఒక రథముగా మనము విశ్వసించాలి ఈ రథమునకు తగిన ఆహారమునే అందించాలి. దీనికి ప్రధానమైనది Mind ఈనాడు మన బండికి చాలా అలంకారములు చేస్తున్నాం బండిని సరైన రీతిలో పెట్టటానికి ఎన్నెన్నో డ్రస్సులు వేస్తున్నాము. కానీ గుఱ్ఱమునకు యేమాత్రము ఆహారమునందించటం లేదు. ఏమిటి అగుఱ్ఱము ? అదే mind ఆ mind కు తగిన మంచి ఆహారము అందించాలి. దీనికి తగిన ఆహారము ఏమిటి:సద్గుణము, సదాలోచన, సచ్చింతనలు, సత్ప్రవర్తన. ఇలాంటి ఆహారమును దానికి అందించాలి. ఆ గుఱ్ఱమే యీ బండిని లాగుకుపోతుంది. దీనికి Food పెట్టకుండా Decoration (అలంకరణ) యేమి ప్రయోజనము? అంతేకాదు యీనాటి ఆధునిక విద్యార్థులు బండి ముందు పెడుతున్నారు గుఱ్ఱమును వెనుక పెడుతున్నారు. అనగా మొట్టమొదట body comfort, body happy. body ఖుషీ, body నే మనము చూచుకుంటున్నాము. కానీ మనస్సు యొక్కదీనిని ఎవరు చూడటం లేదు నీవు శ్రీమంతుడైతే Air condition room కట్టుకోవచ్చును. మంచి సోఫాలు వేసుకోవచ్చును. కానీ అట్టి Air condition room లో నీవు వుండినప్పటికి మనస్సుసరిగా లేక పోతే body cool అవుతున్నాది. కాని mind heat అవుతున్నాది కనుక నీవు మనస్సుకు సరియైనది యిచ్చినప్పుడే Air Condition లేకపోయినా పరవాలేదు. మనస్సు ఆనందంగా వుంటే Forest లోకి పోయినప్పటికి అదే నీకు ఆనందంగా వుంటుంది. rest గా వుంటుంది. ఒక రాతిపైన పండు కున్న హాయిగా వుంటుంది మనస్సు శాంతి లేనివాడు ఎటువంటి హంస తూలికా తల్పముపై పడుకున్నా సుఖము ఉండదు.

విద్యార్థులారా! మనస్సుకు తగిన ఆహారము నందించాలి రాజసిక తామసిక ఆహారము మీరు అందించకూడదు. ఈ frootsకూడను దేహానికి పుష్టినిస్తుందని అధికముగా భుజించకూడదు. మత్తుపదార్థములు ఏమి స్వీకరించరాదు ఈ మత్తుపదార్థముల చేతనే మనస్సు చంచలమైపోతుంది. అంతేకాదు మన జీర్ణకోశమును చంపివేస్తుంది. సృష్టిలో యేవిధంగా వుంటుందో ఆ

సృష్టియొక్క సహజత్వాన్ని మనం అందుకోవాలి అందుకోసమే ప్రాచీన మహర్షులందరు కందమూలాదులు భుజించి, పవిత్రమైనగాలిని తీసుకొని పరిశుద్ధమైన జలమును త్రాగి మంచి ఆరోగ్యవంతులైనూరు నూటపది సంవత్సరములు జీవిస్తూ వచ్చారు. కనుక మనం దీర్ఘజీవితంగా వుండాలనుకుంటే, దివ్యజీవితముగా ఉండాలనుకుంటే సాత్వికమైన ఆహారముతీసుకోవాలి. ఆహారము చేతనే ఆత్మతత్త్వము అర్థమవుతుంది. ఏ సాధనలు చేయవలెనన్నను యీ శరీరమనే పనిముట్టును చాలా ముందు పెట్టాలి. ఇది ఒక యంత్రము. ఈ యంత్రము ద్వారా ఆ తంత్రమును మనం పొందాలి. ఈ యంత్రము ద్వారా ఆ మంత్రము మనము స్మరించాలి కాబట్టి అన్నింటికి దేహమే మూలాధారము. దేహమునకు ఆహారమే మూలము. ఈ ఆహారము సాత్వికమైనదిగను, సత్ప్రవర్తనతో ఆర్జించినదిగను భగవదర్పితముగను వుంటుండాలి. ఇట్టి ఆహారము Pure సాత్వికము చాలామంది డాక్టర్సు చెబుతారు. మాంసము భుజించమని, చేపలు భుజించమని మంచి ప్రోటీన్లు వుంటాయని. వారు ప్రోటీన్లను, దేహము యొక్క బలమును చూస్తారే తప్ప ఆధ్యాత్మిక తత్త్వము వారు విచారించరు పాలలో ప్రోటీను లేదా? పప్పులో ప్రోటీను లేదా? పెరుగులో ప్రోటీను లేదా? తుచ్ఛమైన మాంసము తిని దాని బుద్ధులంతా ఎందుకు మనం పెంచుకోవాలి? మనం Animals గా తయారై పోతాం Food ఎట్లానో Head అట్లా. Head ఎట్లానో God అట్లా Food, Head, God యీ మూడింటికి సంబంధము వుంటుంది. ఈ చేపలు చాలా చురుకు తినం యిస్తుంది. నిజమే. తెలివితేటలనిస్తుంది. కానీ కంపు స్వభావాలను పుట్టిస్తుంది. Bad Thoughts వస్తాయి చేపలు యిచ్చే Bad Thoughts మరేవి యివ్వవు. కనుక వీటిని కొంతవరకు అరికట్టుకోవాలి. ఇంతేకాకుండా తెలిసి తెలిసి మానవుడై పుట్టికూడను ఇతర ప్రాణులను ఎందుకు చంపాలి? ఈనాటి ఆధునిక విద్యార్థులు చెబుతారు అన్నీప్రాణులే కదా! కూరగాయలు ప్రాణులే కదా! అంటారు అన్నీ ప్రాణులే. కానీ కూరగాయలు కోస్తే అది ఏడ్వదే. అయ్యో అని అరవదే. అనగా ఏమిటి? దానికి Senses లేవు. ప్రాణము వుంది కానీ యీ కోడిపిల్ల, చేపపిల్ల యివి కోస్తే చాలా బాధపడతాయి ఈ యొక్క ప్రాణము వుండి Sense లేవిడానికి చిన్న ఉదాహరణము. ఒక రోగికి ఆపరేషన్ చేసేముందు క్లోరోఫారమ్ యిస్తారు. ప్రాణము వుందిగానీ Sense లేవు కోస్తే నొప్పి తెలియదు కుడితే నొప్పి తెలియదు ఏ నొప్పితెలియదు. అలాంటివే కూరగాయలు పంచ్లు ఈ శబ్ద స్పర్శ రూప రస గంధాదులతో అవస్థపడే యీ ప్రాణులను మనం కంటితో చూస్తూ, చెవితో వింటూ, మనస్సుతో అనుభవిస్తూ మనం హింసించరాదు కనుకనే పూర్వ కాలము ఋషులు బ్రాహ్మణులు వీటి జోలికిపోయేవారు కాదు. ఈనాడు బ్రాహ్మణులు అధికంగా భుజించటం మొదలుపెట్టిన తరువాత శూద్రులకు యీ మాంసం చిక్కటంలేదు మార్కెట్టులో. మిగతా జాతివారయినా యీ పొద్దు శనివారము, యీ పొద్దు గురువారము అని భగవంతుని పేరు పెట్టుకొని ఉపవాసము వుంటారుగానీ యివి తినమరిగిన బ్రాహ్మణులకు ఉపవాసమనేదేలేదు. పరులకు బోధించవలసిన బ్రాహ్మణులు యీ దుస్థితికి రావటంచేతనే దేశము అధోగతి పాలైపోతుంది సర్వ బుద్ధులు వారియందే ఆవిర్భవిస్తున్నాయి. ధర్మవిరుద్ధమయిన మార్గాలు వారే చేస్తున్నారు. మానవులలో యీ చెడ్డబుద్ధులు రావటానికి కారణము ఏమిటి? చెడ్డ ఆహారమే దానికి మూలకారణము దుర్మార్గములో సంపాయించిన ఆహారమే దీనికి మూలకారణము భగవదర్పితము చేయని ఆహారమే దీనికి మూల కారణము

విద్యార్థులారా! మీరు భగవదర్పితమైన ఆహారంగా, సన్మార్గార్జితమైన ఆహారంగా, మితాహారంగా తీసుకోండి. అప్పుడే మీయందు భగవత్ప్రేమ, భగవత్ విభూతులు ఆవిర్భవిస్తాయి మనయందు సరియైన భావములు లేక ఎన్ని సాధనలు చేసినప్పటికీ ప్రయోజనము లేదు.

సాధనలో ఆహారవిషయము చిన్నదిగా భావిస్తున్నారు. కాదు, కాదు సాధనకు ఆహారము చాలా ఆధారమైవున్నది ప్రాణసమానమైవున్నది సాత్వికమైనవి చూచి భుజించు లేత వయస్సులోనే అభివృద్ధి గావించుకుంటూ వస్తే భవిష్యత్తులో మనం సరైన గమ్యాన్ని చేరవచ్చును. దీనిని పురస్కరించుకొనియే Start early, drive slowly, reach safely కనుక ఆహారమును గురించి ఎంతైనా చెప్పవచ్చును. మొట్టమొదట మనం భుజించే ఆహారము ఎలాంటిదని కాదు. మనమే ఒక ఆహారము. మన దేహమే ఆహారము. మన మనసే ఆహారము బుద్ధే ఆహారము. మన ఇంద్రియములే ఆహారము అంతా ఆహారమయమే. ఆహారమయమైన దేహము ఆహారమయమైన తత్త్వము మితాహారంగా తీసుకోవాలి అప్పుడే నిత్య సత్యమైన జ్ఞానము మనలో ఆవిర్భవిస్తుంది. సత్యమార్గంలో మనం సహజంగా ప్రవేశిస్తాము జ్ఞానము మనలో ఆవిర్భవించి సులభంగా మనలను అభివృద్ధిగావిస్తుంది కనుక ఈ సత్య మార్గాన్ని అనుసరించండి

( ది 31-5-92 న బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగం )

సాయి చెప్పిన కథలు :

# సులభోపాయము

ఒక ఇంటిలో ఒక అత్తా కోడలు ఉండెడివారు ఆ అత్త, ఆ క్రొత్తకోడలు ప్రతిరోజూ ఇంటిలో కనిపించిన రుచికరమయిన వస్తువులన్నీ తినివేయుచున్నదని నిందారోపణ చేయుచున్నది

అంతలో ఒకరోజు వారింటికి ఆ కోడలి అన్నయ్య, చెల్లిని చూద్దామని వచ్చాడు. వానిని చూచి ఆ అత్త, "ఏమి నాయనా! మీ పిల్లని ఇట్లు తీర్చిదిద్ది మా ఇంటికి పంపినారు పాడి ఉన్నది కదా అని పాలు, వెన్న, జున్ను, నెయ్యి, పెరుగు ఎప్పుడు దొరికిన అప్పుడు తినుచున్నది ఇటువంటి దానిని పెట్టుకుని కాపురం ఎట్లు చేయగలము? నీవైననూ దీనికి బుద్ధి చెప్పు" అని పల్కింది

అంత ఆ అన్న చెల్లితో "ఏమమ్మా! నీ అత్తగారు చెప్పినట్లు ఇన్నియూ తినిన ఇంటికీ ఒంటికీ కష్టము నా మాట విని పాలు మాత్రమే త్రాగుము. మిగిలినవి నీకు వద్దులే" అన్నాడు.

అంత ఆ అత్త "పాలు తప్ప మిగిలిన వెన్న, జున్ను వగైరాలు రుచిగా ఉండవనియూ లేక నీ చెల్లెలకు ఇష్టము లేదనియా? ఎందుకు అవి వద్దనుచున్నావు" అని అడిగిందా అత్తా.

"అదికాదత్తా! నేను చెప్పినట్లామె చేసినచో ఆమె అభిలాష నెరవేరును. ఇన్ని తినుచున్నదన్న నీ ఆ ఆగడము తప్పును" అనెను.

"ఒక్క పాలు త్రాగినంత మాత్రమున అన్నియు ఈమె ఎట్లు తిన్నట్లగును?"

"అత్తా! ఈ వెన్న, జున్ను మున్నగునవి ఈ క్షీరములో లీనమై యున్నవి కావున పాలు త్రాగినచో ఇన్నియూ తిన్న ఫలితము దక్కును కదా!" అన్నాడు నవ్వుతూ.

"ఓరి దొంగా! ఎంత సులభోపాయము చెప్పినావురా? చెల్లిలికి, ఆమెకు బుద్ధి చెప్పినట్లే చెప్పి నన్ను వెక్కిరించావు కదా! గట్టివాడివే!" అందా అత్త నవ్వుతూ.

* అవసరపడినపుడల్లా దేవుని అడుగుట మనకు శ్రమ. అడిగినపుడల్లా ఇచ్చుట దేవునికీ శ్రమ భగవంతుని అనుగ్రహము ఒక్కటి మనము సాధించుకొని మన భారమంతయూ అతనిపైవేసి యూరకున్న మన అవసరమే అతను తెలుసుకుని దానిని సమయానికి పరిష్కరించుట భగవంతుని బాధ్యత యగును. ఇది కదా సులభోపాయము.

( శ్రీ సత్యసాయి కథాసుధ నుండి )

# బహుముఖ విశిష్ట వ్యక్తిత్వంగల మహామనీషి

# శెడింబి హనుమంతరావు

కంచి వాసుదేవరావు

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజున 1947 ఆగస్టు 15 వ తేది సాయంత్రం మచిలీపట్టణం హిందూ కళాశాల ఆవరణలో జరిగే బ్రహ్మాండమయిన పౌరసభకు అధ్యక్షత ఎవరు వహించాలన్న ప్రశ్న వచ్చినప్పుడు - అన్ని వర్గాలవారికీ, అందరు ప్రజలకూ పూజ్యుడు, విశ్వాసనీయుడైన సహస్రమాస జీవి శెడింబి హనుమంతరావుగారు అన్నివిధాల అర్హుడని ఏకగ్రీవంగా భావించడం జరిగింది దాదాపు ఐదు దశాబ్దాలపాటు తన విలక్షణ విశిష్ట వ్యక్తిత్వంతో హనుమంతరావు మచిలీపట్టణం ప్రజాజీవనానికి స్ఫూర్తి కేంద్రం అయ్యారు

బ్రిటిష్‌పాలన కాలంలో కొందరు ప్రభుత్వోద్యోగులు వుండేవారు వారు తమ నీతినిజాయితీ ధర్మనిష్టలలో అటు బ్రిటిష్ అధికారుల అభిమానాన్ని, విశ్వాసాన్ని చూరగొనేవారు. ఇటు ప్రజలు జాతీయభావాలుకల స్థానిక నాయకుల గౌరవాన్ని విశ్వాసాన్ని చూరగొనేవారు ఇట్టివారు అటు ప్రభుత్వానికి యిటు స్థానిక ప్రజా నాయకులకు మధ్య వారధిగా వుండేవారు. అటువంటి వారిలో అనేక సంవత్సరాలు ప్రభుత్వ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేసిన హనుమంతరావు గారు ఒక సౌశీల్యం, సౌజన్యం, సదాశయం, నీతి, నిజాయితీ నైతికనిష్ట తనలో మూర్తీభవింప చేసుకున్న మహామనిషి

1867 లో హనుమంతరావుగారు గుంటూరు జిల్లాలో జన్మించారు. దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు హనుమంతరావుగారి సమవయస్కుడు, సహాధ్యాయి. 1883 లో వెంకటప్పయ్యగారు మెట్రిక్ ప్యాసయినప్పుడు దక్షిణ భారత దేశంలో మెట్రిక్ పాసయిన ప్రథమునిగా హనుమంతరావుగారిని గుంటూరు వీధులలో వూరేగించారని చెప్పుకుంటారు. ఆ తర్వాత ఇద్దరూ మద్రాస్ క్రిస్టియన్ కాలేజీలో చేరి ఇంటర్ ప్యాసయి బి. ఎ. లో చేరారు అప్పుడు మిల్లరు అనే విద్యావంతుడు సంస్కారి కాలేజి ప్రిన్సిపాల్‌గా వుండేవారు. ఆయన లండన్ వెళ్ళినపుడు లాయిడ్ అనే మత దురహంకారి "మీ హిందూ దేవుళ్ళను గుళ్ళలో పూజించే బదులు నా బూట్లను పూజించండి" అని తూలనాడాడు ఈ అనుచిత వ్యాఖ్యలకు నిరసనగా హనుమంతరావు, వెంకటప్పయ్యగార్ల నాయకత్వంలో హిందూ విద్యార్థులు తమ తరగతులను బహిష్కరించారు. వీరి ఆందోళనను మద్రాస్‌లో అప్పటి ప్రముఖ న్యాయవాది పప్పాకం ఆనందాచార్యులుగారు (వీరే తర్వాత కాంగ్రెస్ అధ్యక్షులయ్యారు ఈ పదవి చేబట్టిన తొలి తెలుగువాడు ఆయనే) సమర్థించారు. కాలేజి అధికారులు వీరిద్దరినీ హాస్టలునుంచి పంపించివేశారు. అప్పుడు తంబుశెట్టి అనే ప్రముఖవర్తకుడు వీరికి తన యింట్లోనే వసతి కల్పించారు ఆనందాచార్యులుగారి జోక్యంతో ఆందోళన ముగిసింది. లండన్‌లోవున్న మిల్లర్‌గారికి యీ సంగతి తెలిసి చాలా నొచ్చుకుని వెంటనే తిరిగి మద్రాస్‌వచ్చి వీరిద్దరినీ తిరిగి హాస్టలులో చేర్చుకున్నారు. ఇద్దరూ న్యాయవాది పట్టా తీసుకుని బందరులో 1891-

92 లో ప్రాక్టీస్ పెట్టారు. అప్పుడు ఒంగోలు వరకు కృష్ణాజిల్లాలో అంతర్భాగంగా వుండేది.

## మూర్తీభవించిన విశిష్ట వ్యక్తిత్వం

హనుమంతరావుగారు నిజమైన న్యాయవాది న్యాయం తరపునే ఆయన వాదించేవారు. ధర్మం, సత్యం, న్యాయం ఆయన తూనికరాళ్లు. అవే ఆయనకు గౌరవం తెచ్చిపెట్టాయి. 1900 లో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమితులయ్యారు ఇరువయిరెండు సంవత్సరాలు వారు ఆ పదవిలో కొనసాగారు. అప్పటి పదవీ విరమణ వయస్సు 55 సంవత్సరాలు. పదవీ విరమణ చేయ డానికి ఇంకా ఏడాది వ్యవధి వుండగానే తను పదవీ విరమణ చేస్తున్నట్లు తన స్థానంలో మరొక రిని నియమించుకోవలసిందిగా హైకోర్టుకు ఉత్తరం రాశారు పదవిలో కొనసాగమని కోరినా హనుమంత రావుగారు నిరాకరించారు. సాధారణంగా కొత్త పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను నియమించేటప్పుడు హైకోర్టు సంబంధిత జిల్లా కలక్టర్, జిల్లా జడ్జి సలహాను స్వీక రించి వారి సిఫార్సును ఆమోదిస్తుంది. కాని ఆ పద్ధతికి భిన్నంగా – తన వారసుని నామినేట్ చేయమని హైకోర్టు హనుమంతరావుగారినే కోరడం ఊహించ జాలని గొప్ప విశేషం–దీనినిబట్టి హైకోర్టులో ఆయనకు గల గౌరవం ఎటువంటిదో అర్థం అవుతుంది. అప్పటికి హనుమంతరావుగారి పెద్దబ్బాయి శ్రీనివాసరావుగారు, అల్లుడు ఉమ్మిత్తాల రామారావుగారు న్యాయవాదవృత్తిలో రాణిస్తున్నారు. వీరిద్దరిలో ఎవరో ఒకరిని తన స్థానా నికి సిఫార్సు చేస్తారని అందరూ ఆశిస్తూ వుండగా అందరి అంచనాలను తల్లకిందలు చేస్తూ బొల్లిన నారాయణస్వామి నాయుడుగారి పేరు సూచించారు. ఇది మరింత పెద్ద విశేషం – ఇది ఆయన నిజాయితీకి గీటురాయి.

బంధుప్రీతికి ఆశ్రిత పక్షపాతానికి ఆయన చాలా దూరం – 1928 లో ఆయన కృషితో స్థానిక హిందూ హైస్కూలు కాలేజిగా మారింది. ఆయన మనుమడు బి ఎ మొదటి సంవత్సరం చదువుతూ వుండేవాడు. అతనికి మంచి మార్కులు రాకపోయినా – హనుమంత రావుగారి మనవడు కనుక ప్రిన్సిపాల్ ( కాజ శివరామ కృష్ణారావుగారని గుర్తు ) అతనిని రెండవ సంవత్సరం లోకి ప్రమోటు చేశారు ఇది తెలిసిన హనుమంతరావు గారు తన మనవడిని బి ఎ. మొదటి సంవత్సరంలోనే డిటెయిన్ చేయమని కోరారు

ఇటువంటిదే మరో సంఘటన–1923 లో డా॥ పట్టాభి గారు మచిలీపట్టణంలో ఆంధ్రా బ్యాంకు స్థాపించారు. హనుమంతరావుగారు డైరక్టర్ల మండలి ఛైర్మన్. హనుమంతరావుగారి రెండవ కుమారుడు రామచంద్ర రావుగారు విద్యాధికుడయినా చిన్నతనంలోనే పోలియో వ్యాధి రావడంవలన అంగవికలుడయ్యారు. పట్టాభి గారు ఆయనకు ఆంధ్రా బ్యాంకులో ఉద్యోగంయిచ్చారు. డైరక్టర్ల బోర్డు సమావేశంలో తను ఛైర్మన్‌గా వుంటు న్నందువలన తన కుమారుని ఉద్యోగం రద్దు చేశారు. ఐతే ఆయన హాజరు కాని ఒక బోర్డు సమావేశంలో డైరక్టర్లు అత్యధిక మెజార్టీతో రామచంద్రరావుగారి ఉద్యోగాన్ని ఖాయంచేస్తూ తీర్మానించారు. ఇది తెలిసి హనుమంతరావుగారు తన ఛైర్మన్ పదవికి రాజీనామా చేశారు ఆ తర్వాత రామచంద్రరావుగారు అనేక సంవత్సరాలు – ఆంధ్రా బ్యాంకులో ఉన్నత పదవులను అతి సమర్థతతో నిర్వహించారు

## నిజమైన న్యాయవాది, దానశీలి

హనుమంతరావుగారు నిజమైన న్యాయవాది. న్యాయం తరపునే వాదించేవారు. అంతేకాక తనకు వచ్చే ఫీజు గురించి పట్టించుకోకుండా రాజీకి రాగల అవకాశాలు ఏమాత్రంవున్నా రాజీచేసి పంపించేవారు. జమీందార్లు, నుంచి వర్తకులనుంచి అప్పులు తీసుకున్నవారు అవి చెల్లించలేక అవస్థలు పడుతున్న సమయంలో వారిపై దావాలువేసి డిక్రీలు ఇప్పించవలసిందిగా జమీందార్లు

వర్తకులు హనుమంతరావుగారి వద్దకు వచ్చేవారు. ఐతే హనుమంతరావుగారు ఋణదాతలను ఋణగ్రహీతలను పిలిపించి కోర్టులతో నిమిత్తం లేకుండా వివాదాలు పరిష్కరించేవారు. కోర్టులో కేసులు ఇట్టి కేసులు నడిపివుంటే ఆయనకు అనేక వేలరూపాయల రాబడి వచ్చివుండేది. ఆ రోజులలోనే ఆయనకు నెల రాబడి పదివేల రూపాయలు వుండేదట. నలుగురు గుమాస్తాలు పనిచేస్తూ వుండేవారుట. ఆయన సొమ్మంతా దానాలకు, గుప్తదానాలకు ఖర్చవుతూ వుండేది. బందరులో ప్రాక్టీస్ పెట్టిన తొలిదినాలలో కొంతభాగం కొండా వెంకటప్పయ్యగారికి ఇచ్చి, మిగిలిన సొమ్మును పేద విద్యార్థులకు సహాయంగా అందచేసేవారు. రోజూ వారింటివద్ద 100 మందికి భోజనాలు పెడ్తూ వుండేవారుట. ఆయన అనేక మందికి దానధర్మాలు చేస్తూ వుండేవారు. కాని తాను దానం చేస్తున్నట్లు ఎప్పుడూ చెప్పుకునేవారుకాదు. ఆయన మరణించినప్పుడు కాటూరు వెంకటేశ్వరరావు కృష్ణాపత్రికలో సంపాదకీయం చేస్తూ "ఆంధ్రదేశంలో ఆయన ఇల్లు నిరంతర అన్నసత్రంగా పేర్కొన్నారు.

బందరులో వారి యింటి ఎదుట రెండు దొరవులు వుండేవి. అందులో స్నానం చేసిన ప్రతివారూ వారి యింట్లో భోజనంచేసి వెళ్ళవలసిందే. అర్ధరాత్రి పన్నెండు గంటల వరకు ప్రతినిత్యం అన్నదానం జరుగుతూ వుండవలసిందే. బందరుకు తుఫాన్, ఉప్పెనలు వచ్చినపుడు వరద బాధితులకు గుండిగలతో వంటలు చేయించి పెట్టేవారని చెప్పుకుంటారు.

ఆయన దగ్గర పనిచేస్తున్న ప్లీడరు గుమాస్తాలలో మానపులి లక్ష్మీనారాయణగారు, హనుమంతరావుగారి సంపాదనంతా దానధర్మాలకే ఖర్చయిపోతోంది. ఆయన రిటైరయ్యేసరికి ఏమీ మిగలదన్న దృష్టితో హనుమంతరావుగారికి తెలియకుండా కొంత డబ్బు దాచి, ఆవిధంగా దాచిన డబ్బుతో 100 ఎకరాల భూమిని కొని ఆయన రిటైరయినప్పుడు యిచ్చారుట. ఆయనకు కృష్ణాజిల్లా బంటుమిల్లి వద్ద కొన్ని భూములు వుండేవి. అవి తరచు నీటిముంపునకు గురిఅవుతూ వుండేవి. అవి కౌలుకు తీసుకున్న రైతులను ఎప్పటికప్పుడు ఆదుకుంటూ, చివరకు ఆ భూములను వారికే యిచ్చివేశారు.

## కృష్ణాజిల్లా సంఘ అధ్యక్షుడు

జిల్లా ప్రజలలో ఆర్థిక సామాజిక రాజకీయ చైతన్యం కలిగించే ఉద్దేశంతో ఏర్పడిన కృష్ణాజిల్లా సంఘానికి ఆయన అధ్యక్షులు, కొండా వెంకటప్పయ్యగారు కార్యదర్శి. ఈ సంఘం ఆధ్వర్యంలోనే 1902లో మచిలీపట్నంలో కృష్ణాపత్రిక స్థాపించబడింది. వెంకటప్పయ్యగారు సంపాదకులు, అవటపల్లి నారాయణరావుగారు, దాసు నారాయణరావుగారు ఉపసంపాదకులు. సంపాదకులుగా వెంకటప్పయ్యగారి రచనలు బ్రిటిష్ వారికి బాధ కలిగిస్తూ వుండేవి. అప్పటి మద్రాస్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి 'స్టోక్సు' ఈ పత్రికపై చర్య తీసుకోవాలని ప్రయత్నించినా హనుమంతరావుగారు ఛైర్మన్‌గావున్న జిల్లా సంఘం ఈ పత్రికను నడుపుతున్నందువలన ఎట్టి చర్య తీసుకోవడం జరుగలేదు.

1904 లో కృష్ణాజిల్లా విభజన జరిగి గుంటూరుజిల్లా ఏర్పడింది. వెంకటప్పయ్యగారు తన మకాం గుంటూరుకు మార్చారు. 1907 లో ముట్నూరి కృష్ణారావుగారు కృష్ణాపత్రిక సంపాదకులయ్యారు. ఆయన రాసిన సంపాదకీయం తీవ్రమైన ధోరణిలో వుంది. ఆ సంపాదకీయంతో పత్రిక బయటకు వెళ్ళితే ప్రమాదం తప్పదని గ్రహించి, ఆ సంచిక కాపీలన్నిటినీ తగులబెట్టినా ఒకటి రెండు కాపీలు చండశాసనుడైన జిల్లా కలక్టరుకు అందాయి. దాంతో ఆయన ఉగ్రరూపం దాల్చాడు. ఐతే జిల్లా సంఘం ఆధ్వర్యంలో ఈ పత్రిక నడుస్తున్నందువలన హనుమంతరావుగారిని పిలిపించి కృష్ణారావుగారిని తొలగిస్తే తను యే చర్య తీసుకోనని అన్నారు. అప్పుడు పట్టాభిగారు ఆ పత్రికను స్వాధీనపరచుకొని మూడు సంవత్సరాలు

తర్వాత తిరిగి కృష్ణారావుగారికి అప్పగించారు. హనుమంతరావుగారు అప్పుడు లేకపోతే కృష్ణాపత్రిక శాశ్వతంగా మూతపడి వుండేది.

డా॥ పట్టాభిగారు మచిలీపట్టణం నుంచి జన్మభూమి అనే ఇంగ్లీషు వార పత్రికను నిర్వహిస్తూ వుండేవారు. పట్టాభిగారి రచనలు జిల్లా కలెక్టరుకు కారం రాసినట్లు వుండేది. పట్టాభిగారి ప్రాసిక్యూట్ ని చేయమని అప్పటి జిల్లాకలెక్టర్ టి జి రూత్‌ఫార్డు నోటీస్ ఇచ్చి, ఆయనపై కేసు బనాయించి హనుమంతరావుగారిని వాదించమన్నారు. ఆయన పట్టాభిగారి రచనలలో అభ్యంతరకరమైనవి లేవని, కేసు నిలవదని చెప్పారు. దాంతో మద్రాస్ ప్రభుత్వం వెనక్కు తగ్గింది రెండు సంవత్సరాలపాటు ఆ కేసును పెండింగ్‌లో వుంచి చివరకు ఉపసంహరించుకున్నారు.

ఆంధ్రాబ్యాంకు చైర్మన్‌గా వున్నప్పుడు స్వరాజ్య పత్రిక నిర్వహిస్తున్న ఆంధ్రకేసరి ప్రకాశంగారు ఆంధ్రాబ్యాంకు నుంచి రుణాలు తీసుకుంటూ వుండేవారు ఇతర డైరెక్టర్లు ప్రకాశంగారికి రుణం యివ్వరాదని అభ్యంతరం పెట్టినా హనుమంతరావుగారు సొంత పూచీకత్తుపై రుణాలు యిప్పించేవారు ప్రకాశంగారు ఆ రుణాలను చెల్లించలేకపోతే హనుమంతరావుగారు గుట్టుచప్పుడు కాకుండా చెల్లిస్తూవుండేవారు.

మచిలీపట్టణంలో జరిగే ప్రతి ప్రజాహిత కార్యక్రమానికి హనుమంతరావుగారికి సన్నిహిత సంబంధం వుండేది బందరు హిందూ హైస్కూలు (హిందూ హైస్కూలుతో ఒక బ్లాకుకు ఆయన పేరు పెట్టారు) ఆంధ్ర జాతీయ కళాశాల, ఆంధ్రాబ్యాంకు, మొదలైన అన్నిటిలోనూ ఆయనకు ప్రమేయం వుండేది పీటి అభివృద్ధికి ఆయన చేసిన కృషి అనల్పమైనది. ఆయన బ్రిటీష్ ప్రభుత్వద్యోగి. అయినా జాతీయ నాయకులు మచిలీపట్టణం వచ్చినప్పుడు ఆయన ఇంటే బస చేసేవారు. డా॥ అనీబిసెంట్, మహాత్మా గాంధీ వారింట్లో బస చేసి ఆయన ఆతిథ్యం స్వీకరించిన వారిలో ప్రముఖులు. భారత స్వాతంత్ర్యోద్యమం పట్ల ఆయనకు సానుభూతి వున్నా మహాత్మా గాంధీ శాసనోల్లంఘన సహాయ నిరాకరణ ఉద్యమాలు అణచడానికి దారితీస్తాయని ఆయన భావించేవారు.

హనుమంతరావుగారి అధ్యక్షతన ఎందరికో సన్మానాలు జరిగాయి. వీటిలో చెప్పుకోవలసింది, విశ్వనాథ సత్యనారాయణగారికి కవిసామ్రాట్టు బిరుదు ప్రదానం. ప్రభుత్వం రావుబహాదూర్ ఇచ్చినపుడు స్వయంగా స్వీకరించడానికి వెళ్ళలేదట.

మహాత్మాగాంధి హత్య చేయబడిన వారం రోజులు కాకముందే హనుమంతరావుగారు పండుటాకులా రాలిపోయారు కొటూరు వెంకటేశ్వరరావుగారు కృష్ణా పత్రికలో ఆయన గురించి సంపాదకీయం "పట్టాభి, ప్రకాశంవంటి నాయకులు ఆయన ముందు భక్తితో తల వంచుకోవలసిన ఉన్నత వ్యక్తిత్వం హనుమంతరావు గారిద"ని రాశారు. ఒకసారి ముట్నూరి కృష్ణారావు గారు ఒక ఉపన్యాసంలో "పంతులుగారు తలచుకొంటే అందని హోదాలేదు కాని వారికి అట్టి వ్యామోహం లేదు. పంచపాండవులలోని ఆదర్శాలన్నీ వారిలో మూర్తీభవించిన మానవాతీతులు అన్నారు. జిల్లా జడ్జి పదవి వస్తే ఆయన వ్యతిరేకించారు. ఆయన మరణించినప్పుడు పట్టాభిగారు ఇంగ్లీషులో ఆయన గురించి వ్రాస్తూ

"At a time, when the legal profession Suffered moral indignition, and baseless and candercended to the level of a vocation, these two lions of legal firmament at the Krishna District Sedimbi Hanuman ha Rao and Konda Venkatappaiah infused tone of honesty in to the profession and named it to the pinacle of its purity" అని రాశారు.

(న్యాయవాద వృత్తి నైతికంగా పతనమయి భ్రష్టమై ఒక వృత్తిగా మాత్రమే మిగిలినప్పుడు - న్యాయవాద వృత్తిలో జంట సింహాలువంటి వీరు కృష్ణాజిల్లా న్యాయవాద వృత్తిలో నిజాయితీ నెలకొల్పి దాన్ని శిఖరాగ్రాలకు తీసుకువెళ్ళారు.)

సెడింబివారిని ఆంధ్రదేశమూ, మచిలీపట్నం మరచిపోయినా ఆయన మహామనీషి. ○

సాయుజ్యానికి సామీప్యము

# సౌఖ్య సాన్నిధ్యము

—పంచాంగము శీనప్పశాస్త్రి

శ్రీ మహోదాత్త పరమార్ధ భావనలకు మూలమైన దే భగవాన్ శ్రీ సత్యసాయీ నివాసము. అదే పుట్టపర్తి ప్రశాంతిధామము మానవుడు భవబంధాలనుంచే ముక్తి నొందుటకు నాలుగు విధానాలు - మన మహర్షులు నిర్దేశించినారు 1 సాలోక్యము 2 సామీప్యము 3. సారూప్యము, 4 సాయుజ్యము అనే పేర్లతో వెలసియున్నవి.

బాబాగారిని దర్శించుటకు వచ్చే భక్త సందోహము లందు - పరిశోధకులు, కేవలము వేడుకలు చూద్దామని వచ్చేవారు, భగవదానందము పొందుదామనేవారు, వ్యాపార వైభోగాలకు కొందరు, అనేకమైన విధాలుగా వున్నారు. నిజమైన భక్తిభావనతో స్వామిని చూచి భగవంతుని లోకము చేరుటకు ప్రయత్నించవలెనని నిశ్చయించుకొనేవారికి సులభ సాధ్యమైన అవకాశములు ప్రశాంతి నిలయమందు సమకూర్చబడినవి అక్కడే నివశిస్తూ బాబాగారి నిత్యసందర్శనభాగ్యముతో సంతుష్టి చెందుతూ సాలోక్యము నందుకోగలరు.

స్వామివారి చైతన్యదాయకమైన దృష్టి ప్రసారముతో శారీరక మానసిక దోషాదులకు దూరమై ముక్తి పథానుసారులై, దేవుడనే దివ్యధామమునందు సామీప్య సౌభాగ్యాలందుకోగల్గుచున్నారు బాబాగారే నిర్దేశించిన సత్య, ధర్మ, శాంతి ప్రేమలను అనుసరిస్తూ ఆచరిస్తూ శక్త్యానుసారము పరహితార్ధమైన నిస్వార్ధ సేవలను, దైనందిన జీవన విధానములందు ఆచరించి దివ్యానుభూతుల నందుకొంటూ సారూప్య విధానమున ముక్తి సౌధమందుకొనే సువర్ణావకాశము మన ముందున్నది. ప్రతి దినమూ స్వామిని దర్శించి ఆనందించడమేమో, సాలోక్యమగుచున్నది. ప్రశాంతినిలయానికి దగ్గరగా నివాసాలేర్పరచుకొని, ఆకారం దాల్చి వచ్చిన సాకార పరబ్రహ్మకు సామీప్య సాన్నిధ్యాలలో భగవత్ సాధనలనుసరింతము భగవదన్వేషణకునికి సులభ సాధ్యమగుచున్నది

బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకమైన దత్తాత్రేయ మూర్తి శ్రీ సత్యసాయీ ప్రభువు చెప్పుచున్నారు. మానవా ! నీవాత్మస్వరూపుడవు. అమృతత్వమే నీది. దేహాత్మభావనకు దూరమై సకల చరాచర ప్రపంచాన నిండి నిభిడీకృతమైన అఖండ సచ్చిదానంద చైతన్య స్వరూప భావనలవగాహనచేసుకొని, ప్రేమతో జీవించమని దివ్యసందేశము లందిస్తూవున్నారు. నాల్గు పద్ధతుల ద్వారా ముక్తిపథమునందుకోడానికి మన వేదాంగములే చూపించిన సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు, బాబాగారి ప్రశాంతినిలయము చేరు భక్తులకు సులభసాధ్యమవుతున్నాయని విశదమగుచున్నది. నేను అనే నామధేయము పొందిన ఆత్మస్వరూపమే-బాబాగారి దివ్యమంగళమూర్తి అని అవగాహన పొందిన భక్తుని దృష్టిలో.— స్వామి యోగి కాదు, భోగి కాదు, సాధువు కాదు, సన్యాసి కాదు. అంతమే లేని ఆనందమందించే పరబ్రహ్మాత్మకమూర్తియే శ్రీ సత్యసాయి - అని ప్రేమ భక్తితో సేవించిన ముక్తిసౌధమందుకోవలసి యున్నది.



# సాధకుడు - సాధన

శ్రీ చంద్రశేఖరానందగిరిస్వామి

" దేవార్చన స్నానశౌచభిక్షాదే
వర్తతాం వపుః
తారం జపతు వాక్ తద్వత్
పఠత్వామ్నాయ మస్తకమ్
విష్ణుం ధ్యాయతు
ధీర్యద్వా బ్రహ్మానందే విలీయతాం
సాక్ష్యహం కించిదప్యత్ర
నకుర్వే నాపికారయే "

మెట్లు ఎక్కుట వలన గృహములోనికి ఎట్లు ప్రవేశించుచున్నామో సాధకుడు కొన్ని నియమములను పాటించుటవలన తప్పకుండ సాధకుడు తన లక్ష్యమును స్వరూపస్థితిని మోక్షమును అనుభూతిని పొందును.

సాధకుడు ప్రతి దినము నియమము తప్పక స్నానశౌచాదులచే తన శరీరమును శుచిగా నుంచుకొని పరిశుద్ధమైన వస్త్రములను ధరించి దేవతార్చనాదులను ఆచరించుట వలన మనస్సునందలి కామ రాగద్వేషాదులనెడి దోషములను నిర్మూలనము చేయవలెను. భగవంతుడిచ్చిన త్రికరణములను తన స్వధర్మమునందు లీనమొనర్చుటవలన నిష్కామముగ ఆచరించుట వలన చిత్తశుద్ధి కలుగును. Man must try to transfarm his work into warship. తన శరీర పోషణమునకు భిక్షాన్నమువలె హితమిత పవిత్ర ఈశ్వరార్పిత సాత్త్విక ఆహారమును స్వీకరించవలెను. live to eat కాకుండా eat to live కావలెను. ఎల్లప్పుడు వాక్కును భగవన్నామ సంకీర్తనయందుంచవలెను. పవిత్రమైన శబ్దములను వాక్కు ద్వారా పలుకవలెను. అటులనే సర్వేంద్రియములచే పవిత్ర కార్యములనే ఆచరించవలెను సదా మనస్సును ఉపనిషత్ లేక భగవద్గీతాది శాస్త్రాధ్యయనమునందుంచవలెను. గురు శుశ్రూషాదులచే తత్త్వమసి మహావ్యాకార్థమును తెలుసుకొని సదా అభేదానుసంధానము చేయుచుండవలెను. బుద్ధిని తన ఇష్టదైవము అయిన విష్ణువునందు గాని యితర దేవతలయందు కాని లీనమగునట్లు చూడవలెను. లేక ఇతరాలంబనలు వదలి తన స్వరూపమైన బ్రహ్మానందమునందు లీనమగునట్లు చూడవలెను. ఇట్లు సాధకుడు సాధనచేత తన త్రికరణములను పరిశుద్ధము చేయుట వలన చివరికి తన్ను సాక్షి స్వరూపముగ అనుభూతమొనర్చుకొని భగవద్గీతయందు చెప్పినట్లు " నవద్వారే పురే దేహీ నైవకుర్వన్ నకారయన్ " నేను నవద్వారములు గల పురమనే దేహమున నున్నను కొంచెమైనను చేయను చేయించను కర్తృత్వ భోక్తృత్వ రహిత స్వరూప స్థితిని మోక్ష స్థితిని పొందును. గావున ప్రతి మానవుడు పై నియమములను పాటించి తన జీవిత లక్ష్యమును సాధించవలెను అట్టి శక్తిని భగవంతుడు సర్వులకు ప్రసాదించును గాక !

## చందాదారులకు మనవి

* తమ చందాలను కనీసం ఒకనెల ముందుగా రెన్యూవల్ చేయవలెను. * తమ చందాను రెన్యూవల్ చేయదలచినవారు కనీసం ఒక నెల ముందుగా తెలియపరచవలెను. * చిరునామా మార్పు కావాలని కోరేవారు విధిగా తమ చందా నెంబరును పేర్కొంటూ పాత చిరునామా మరియు క్రొత్త చిరునామా వివరంగా పేర్కొనవలెను.

# గయోపాఖ్యానం (కథ)

చింతపల్లి అన్నపూర్ణ

మ్యాక్‌బెత్ నాటకంలో విలియం షేక్స్‌పియర్ చెప్తాడు "లైఫ్ ఈజ్ బట్ ఎ వాకింగ్ షాడో ఎ పూర్ ప్లేయర్ దట్ స్ట్రట్స్ అండ్ ఫ్రెట్స్ హిజ్ అవర్ అపాన్ ది స్టేజ్ అండ్ ఈజ్ హర్డ్ నో మోర్"

"ఈ ప్రపంచంలోని ప్రతి వ్యక్తికీ ఒక పాత్ర యివ్వబడింది దాన్ని ఆ వ్యక్తి పోషించి తెర మరుగై పోవలసిందే"

**ఈ వేదాంతం** రాజేంద్రప్రసాద్‌కి బాగా వంటపట్టినట్లు వున్నది. అతను 'నాటకంలో వేషం కావాలి' అనే పట్టుబట్టాడు కానీ తెర మరుగైపోదల్చుకోలేదు

దత్తాత్రేయ శాస్త్రిగారు విజయవాడలో ఒక పెద్ద వ్యాపారస్తుడు ఆయన భార్య సులోచనమ్మగారు వంట యిల్లు తప్ప ఏమీ తెలియని మనిషి. ఆమె రోజులో చాలా భాగం మడిలోనే వుంటుంది.

దత్తాత్రేయ శాస్త్రిగారు ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ చదివి విజయవాడలో ఎలక్ట్రానిక్స్ గూడ్సు షాపు ఒకదాన్ని నడుపుతున్నాడు ఆయన వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా సాగుతున్నది ఆయనకు ముగ్గురు సంతానం పెద్దది సునంద. పెళ్ళి అయ్యి అత్తవారి యింటికి వెళ్ళిపోయింది రెండో సంతానం వెంకటేశ్. అతను ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ చదివి విజయవాడలోనే ఎలక్ట్రికల్ సామానుల షాపు ఒకదాన్ని పెట్టాడు. అతని పని కూడా మూడు పువ్వులూ, ఆరు కాయలుగానే వున్నది మూడో సంతానం రాజేంద్ర ప్రసాద్ అతను చదవటం అయితే మద్రాసులోని M I.T. లో ఆటోమొబైల్ ఇంజనీరింగ్ చదివాడు అతనికి విజయవాడలోనే ఆటోమొబైల్ స్పేర్సు షాపు గానీ లేదా పంక్చరుషాపు గానీ పెట్టమని దత్తాత్రేయ శాస్త్రి గారు ఎన్నో సార్లు చెప్పిచూశారు గానీ రాజేంద్ర ప్రసాద్‌కి అందులో ఆసక్తి లేదు

రాజేంద్రప్రసాద్‌కు పెద్ద నటుడు అయిపోవాలి అని వున్నది.

రాజేంద్రప్రసాద్ స్కూలులో లో గానీ నాటకాలు వేయలేదు. కానీ అతనికి తనలో 'అజ్ఞాత ప్రజ్ఞ' (Hidden talent) వున్నది అని నమ్మకం. అతని అభిమాన నటుడు రాజ్‌కపూర్ రాజ్‌కపూర్ ప్రజా నటుడు (People's star) రాజేంద్రప్రసాద్ ఒంటరిగా వున్నప్పుడు రాజ్‌కపూర్ లాగా నడుస్తూ, అద్దంలో చూసుకుని రాజ్‌కపూర్ లాగా అభినయిస్తూ వుండేవాడు. ఏదో ఒక రోజు తను కూడా రాజ్‌కపూర్ అంతటి నటుడు అయిపోతాడు అని అతని నమ్మకం.

వెతగ్గా, వెతగ్గా చివరికి రాజేంద్రప్రసాద్‌కి గయోపాఖ్యానంలో అర్జునుడి పాత్ర లభించింది. ఆ నాటకం వేసే కంట్రాక్టరు దత్తాత్రేయ శాస్త్రిగారికి మంచి స్నేహితుడు ఆ నాటక దర్శకుడు దత్తాత్రేయ శాస్త్రిగారి పెద్దకొడుకు వెంకటేశ్‌కు మంచి స్నేహితుడు. అందువల్లనే రాజేంద్రప్రసాద్‌కు అందులో అర్జునుడి పాత్ర లభించింది. ఆ నాటకం శ్రీరామనవమి రోజులలో 'గవర్నరుపేట సెంటరులో పందిళ్ళ క్రింద వేయాలి' అనుకున్నారు నాటకం ఇంకా నెలరోజులు వున్నది అనగా రిహార్సల్స్ మొదలుపెట్టారు.

సులోచనమ్మగారికి మాత్రం కొడుకు నాటకంలో వేషం వేయటం యిష్టమే. ఆమె చదివింది అయిదో తరగతి వరకే అయినా పురాణాలు, భగవద్గీత,

క్షుణ్ణంగా చదివింది. కొడుకు పౌరాణిక నాయకుడుగా వేయటం ఆమెకు చాలా సంతోషంగా వున్నది ఏమో ! తన కొడుకు ఏదో ఒక రోజు మహా నటుడు అవుతాడేమో ! తన తల్లిదండ్రులకి కీర్తి ప్రతిష్టలు వచ్చేట్లు చేస్తాడేమో !

" మీరూ బిజినెస్ చేస్తు వుంటిరి మన పెద్ద అబ్బాయీ బిజినెస్ చేస్తుండెనూ చిన్నవాడికి నటనలో ఆసక్తి వాడికి నచ్చిన దారిన వాడిని పోనివ్వండి ఎందుకు కూడదు ? వాడు మహా నటుడు అయ్యి మనకు కీర్తి ప్రతిష్టలు వచ్చేట్లు చేస్తాడేమో ? " అన్నది సులోచనమ్మగారు దత్తాత్రేయ శాస్త్రిగారితో

" నువ్వు నోరు ముయ్యి ! నలుగురిలో నోరు మెదపలేడు పెద్దల ముందు నిలబడలేడు ఈ చవట ఎహా నటుడు అవుతాడా? చెప్పినట్లు విని బిజినెస్ చేసుకోక!" అన్నాడు దత్తాత్రేయశాస్త్రి

" మీరు వూరుకోండి " "కలిసివచ్చే కాలానికి నడిచి వచ్చే కొడుకు పుడతాడు" అని కాలం కలిసివస్తే వాడికి నటనా, వాక్చాతుర్యం అన్నీ వస్తాయి మీరు అట్లాగ చూస్తూ వుండండి. వాడి జాతకంలో ఏం రాసి పెట్టి వున్నదో ఏ పుట్టలో ఏ పాము వున్నదో ? " అన్నది సులోచనమ్మగారు

" ఆ పుట్టలో మాత్రం వానపామే వున్నది " అన్నాడు దత్తాత్రేయ శాస్త్రిగారు

అకస్మాత్తుగా రాజేంద్రప్రసాద్‌కి ఇంకో సంగతి తెలిసింది నాటకం చూడటానికి ప్రఖ్యాత సినీ దర్శకుడు విజయకుమార్ వస్తున్నాడట రాజేంద్రప్రసాద్ తన నటనలో మరింత మసాలా కలపాలి అనుకున్నాడు ఎవరు చూశారు ? విజయకుమార్‌కి తన నటన నచ్చితే తనకు సినిమా ఛాన్సు తగులుతుందేమో !

" ఒక ఎక్స్‌ప్రెషనూ లేదూ, ఒక డైలాగ్ డెలివరీ లేదు వీడి మొహం నటఘోటక " అన్నాడు నాటక దర్శకుడు రామకృష్ణ వెంకటేష్‌తో వెంకటేష్ నవ్వి వూరుకున్నాడు. అతనికి తెలుసు తన తమ్ముడి ప్రతిభ

ఒకసారి మూతి కాలితే వాడికే బుద్ధి వస్తుంది " అన్నాడు రామకృష్ణతో నవ్వుతూ.

దత్తాత్రేయ శాస్త్రిగారి షాపులో గుమాస్తాగా వున్న రమణయ్య నాటకం రిహార్సల్స్ చూసి వచ్చి సులోచనమ్మగారితో " అబ్బాయిగారు మహానటుడండి. అర్జునుడి పాత్ర వేస్తున్నారుగదా ! ఆశ్రితుడు అయిన గయుడికి శరణు యివ్వాలా వద్దా, బావ అయిన కృష్ణుడితో యుద్ధం చేయాలా వద్దా అనే దృశ్యంలో రెండు విరుద్ధ భావాల మధ్య సంఘర్షణ అబ్బాయిగారి ముఖంలో కొట్టవచ్చినట్లు కనపడిందండి. ఎంత కఠిన హృదయం అయినాసరే ఆ ఎక్స్‌ప్రెషనకు కరిగిపోవలసిందేనండి అబ్బాయిగారు ఏదో ఒక రోజు మహా నటుడు అయిపోతాడండి " అన్నాడు. సులోచనమ్మగారు సంతోషంతో తబ్బిబ్బు అయింది

నాటకంలో రిహార్సల్స్ చూసి వచ్చిన పని మనిషి ఇందిరమ్మ సులోచనమ్మగారితో "అమ్మగారూ ! అబ్బాయిగారు అర్జునుడిగా భలేగా ఏక్షను చేస్తున్నారండి మిగిలిన యాక్టర్లు అందరూ తొమ్మిది రసాలు పోషిస్తే అబ్బాయిగారు పది రసాలు పోషిస్తున్నారండి " అన్నది సులోచనమ్మగారితో సులోచనమ్మగారు పొంగిపోయి ఇందిరమ్మకు ఒక పాత చీరెను యిచ్చింది.

ఒక రోజు రాజేంద్రప్రసాద్ తోటి నటీమణులు రాజేంద్రప్రసాద్ యింటికి వచ్చారు "ఒక్క మాట చెప్పాలండీ ! మీ అబ్బాయికి నటన వచ్చినా రాకపోయినా Gentlemanly Actor పెద్దమనిషి తరహాగా వుంటాడు హీరోయిన్ ఒంటిమీద చెయ్యి వెయ్యడు. దూరంగా నిలబడి ప్రేమిస్తాడు అదే చలపతి అయితేనా, హీరోయిన్‌ను మెలివేసుకుపోతాడు - కొండచిలువలా. చలపతిగారితో నటిస్తే రెండు రోజుల దాకా మాకు ఒకటే ఒళ్ళు నొప్పులు " అన్నది సుభద్ర పాత్రధారిణి శైలజ దత్తాత్రేయశాస్త్రిగారితో దీన్ని విన్న సులోచనమ్మగారు పొంగిపోయింది. తన కొడుకు బుద్ధిమంతుడు అయినందుకు

" నిటలాక్షుండు యిప్పుడు ఎత్తి వచ్చిన రానీ " అని మీ అబ్బాయి అభినయిస్తూ దుమ్ము లేపాడు Not in the figurative scnce - but actually. మీ అబ్బాయి అభినయిస్తావుంటే రిహార్సెల్స్‌లో నేల మీద దుమ్ము లేస్తున్నది. రేపు మీ అబ్బాయి సినిమాలలో హీరో అయ్యి ప్రేమ సన్నివేశంలో హీరోయిన్‌తో తోటలో డాన్స్ చేశాడు అనుకోండి, ఆ తోటలో మళ్ళీ వారం రోజుల దాకా గడ్డి మొలవదు " అన్నాడు క్రిష్ణ పాత్రధారి రఘురాం దత్తాత్రేయశాస్త్రిగారితో.

" అంతే మీ అబ్బాయి ఒళ్ళు దాచుకోడు. రూపాయి నటన చేయవలసిన చోట రెండు రూపాయల నటన చేస్తున్నాడు. బరువైన డైలాగులు మరీ భారంగా చెప్తున్నాడు. కోపంగా చెప్పవలసిన డైలాగులు మరీ చిందులు తొక్కుతూ చెప్తున్నాడు. మీ అబ్బాయి కష్ట జీవి. కష్టపడి నటిస్తున్నాడు. తను కష్టపడుతున్నాడు, మమ్మల్ని కష్టపెడుతున్నాడు. మీ అబ్బాయి నటన, శాకాహారం తినేవాళ్ళు చూడలేరు, మాంసాహారులకే " అన్నాడు గయ పాత్రధారి మణి దత్తాత్రేయశాస్త్రిగారితో. ఇది అవహేళనో, పొగడ్తో సులోచనమ్మగారికి తెలియ లేదు.

ఇన్ని విమర్శల మధ్య వ్యాఖ్యానాల మధ్య చివరకు నాటకం మొదలుఅయ్యింది ముందు సీట్లో దత్తాత్రేయ శాస్త్రిగారూ సులోచనమ్మగారూ, వెంకటేశ్, సినీ దర్శకుడు విజయకుమార్ కూచున్నారు. రాజేంద్రప్రసాద్ యింకా స్టేజీమీదకు రాలేదు. గ్రీన్‌రూమ్‌లో కూచుని మననం చేసుకుంటున్నాడు. ఇప్పుడు గయుడు వచ్చి శరణు అడుగుతాడు " గయుడా ! భయపడకుము " అనాలి. గయుడు తన కాళ్ళమీద పడతాడు అప్పుడు తను అతన్ని లేవనెత్తి "గయుడా ! అభయమిత్తును" అనాలి. రాజేంద్రప్రసాద్ పదే పదే డైలాగులు పది సార్లు వల్లెవేసుకున్నాడు.

ఎట్లాగైతేనేం, రాజేంద్రప్రసాద్ పాత్ర వచ్చింది. గయుడు వచ్చి శరణు అడిగాడు. రాజేంద్రప్రసాద్ ఒకసారి ప్రేక్షకులలోకి చూశాడు. వందల కొద్దీ జనం ఉత్కంఠతతో చూస్తున్నారు. ముందు సీటులో దత్తాత్రేయశాస్త్రిగారు ఉగ్రంగా చూస్తున్నారు. లైట్లు ఫెళ ఫెళా వెలుగుతున్నాయి. రాజేంద్రప్రసాద్ గొంతులో తడి ఆరిపోయింది. కాళ్ళు ఒణికాయి.

"భయుడా ! గయపడకుము" అన్నాడు గంభీరంగా.

"ఏమిటి స్వామీ!" అన్నాడు గయ పాత్రధారి మణి నిశ్చేష్టుడై.

"అయుడా ! గభయమిత్తును" అన్నాడు రాజేంద్రప్రసాద్ మళ్ళీ గంభీరంగా.

తెర వాలింది.

" అనివార్య కారణాల వలన నాటకాన్ని ఆపు జేస్తున్నాం. దానికి బదులు రికార్డు డాన్సింగు చూపిస్తాం" అని మైక్‌లో ప్రకటించారు. ప్రేక్షకులు సంతోషంతో చప్పట్లుకొట్టారు. రికార్డు డాన్స్ వారికి ఆనందం.

మూడు నెలల తరువాత గయ పాత్రధారి మణికి దత్తాత్రేయశాస్త్రిగారు బీసెంట్ రోడ్డులో కనిపించారు. " ఇప్పుడు రాజేంద్రప్రసాద్ ఏం చేస్తున్నాడండీ " అని మణి అడిగాడు.

" మా అబ్బాయి దారిలో పడ్డాడు గవర్నరుపేటలో ఆటో స్పేర్సు షాపు ఒకదాన్ని తెరిచాడు షాపు ఇప్పుడు బాగా నడుస్తోంది " అన్నారు దత్తాత్రేయశాస్త్రిగారు.

" భయుడా ! గయపడకుము " ఇదీ మీ అబ్బాయి వ్యాపార రహస్యం " అన్నాడు మణి నవ్వుతూ

దత్తాత్రేయశాస్త్రిగారు కూడా చిన్నగా నవ్వేరు

(అమెరికాలో జరిగిన ఒక యదార్థ గాథ ఆధారంగా)

( 12 వ పేజీ తరువాయి )

మహా భారతములోని పాండవులు, రామాయణము లోని సోదరులు చక్కని ఆదర్శము. ఎన్నో కష్టములు వచ్చినప్పటికిని ఎదుర్కొని భగవంతునిపై ప్రేమచేత స్వామ్యము సాధిస్తూ వచ్చారు పాండవులు. పాండవాగ్రజుడైన ధర్మజుడు కృష్ణ చింతన తప్ప అన్య చింతన తనకేమాత్రం లేదు. కనుకనే ధర్మజుడు అనన్య చింతతో ఆహ్లాదించేవాడని పేరు. కారడవులలో ప్రవేశించి, కఠిన నేలపై పవళించి, కందమూలాదులు భక్షించి కఠినమైన జీవితమును గడుపుతూ కూడను కృష్ణనామమే అతని నాలుకయందు నాట్యమాడుతూ వచ్చింది. తన పత్నిని అనేక విధముల పరాభవము సలిపినప్పుడు కూడను కృష్ణనామమే ఆధారము చేసుకున్నాడు గానీ తాను లొంగలేదు. తన కుమారులైన ఉప పాండవులను అశ్వద్ధామ గొంతు కోసినప్పుడు కూడను తాను చింతించలేదు. కృష్ణనామమునే చింతిస్తూ వచ్చాడు. రారాజుగా వుండినప్పుడు కూడను ఆ సంతోషమునకు పొంగలేదు. ఈ దుఃఖమునకు కృంగ లేదు. పొంగి కృంగనటువంటి సమత్వమును అనుభవిస్తూ వచ్చాడు ధర్మజుడు. పాండవులు పరమాత్మను మొట్టమొదట వుంచుకున్నారు తదుపరియే జగత్తును భావిస్తూ వచ్చారు. కట్టకడపటికి తాము అనేటటువంటి అహంకారాన్ని వదలిపెట్టారు. First God, next world, last I. తమ తత్త్వాన్ని తాము వదలుకొన్నారు.

కౌరవులేరీతిగా వున్నారు? First I, Next world, Last God. కనుక వారన్నింటియందు Lost అయిపోయారు. పాండవులన్నింటికిని పరమాత్మను ముందు పెట్టుకొని తమ జీవితమును ప్రారంభిస్తూవచ్చారు. కనుక అన్నింటియందు విజయమును సాధిస్తూవచ్చారు. కనుక మనము విజయాన్ని సాధించాలంటే భగవత్ప్రేమ ఒక్కటే సరియైన అస్త్రము

మహర్షులు కారడవులలో తపస్సు చేస్తూవచ్చారు. కారడవులందు క్రూరమృగములు జీవించేటటువంటివి. కానీ ఆ క్రూరమృగములు తాము సమానముగా ఒకే అరణ్యమునందు జీవితము గడుపుతూవచ్చారు. వీరి దగ్గర యే అస్త్రములుంటున్నాయి? ఏ అస్త్రము లేదు. ప్రేమాస్త్రము ఒక్కటే భగవంతుని ప్రేమిస్తూ నిత్య జీవితము గడుపుతూవచ్చారు. ఆ ప్రేమతత్త్వమే క్రూరమృగముల యందు ప్రతిబింబింప చేసింది. కనుక క్రూరమృగములన్నియు కూడను ఈ ఋషులచెంత సమత్వంగా భావించి మేకలవలె జీవిస్తువచ్చాయి. కనుక ప్రేమ మానవుని అన్ని విధములైన సమత్వమునకు తీసుకొనివస్తుంది. క్రూరత్వమును నిర్మూలనము చేస్తుంది, సాధుత్వాన్ని పెంచుతుంది. సమత్వాన్ని చేరుస్తుంది. ఇది ప్రేమ యొక్క ప్రధానమైన శక్తి. ఇట్టి పవిత్రమైన, దివ్యమయిన భవ్యమయిన ప్రేమతత్త్వాన్ని యీనాటి యువకులు గుర్తించటానికి ప్రయత్నించటము లేదు. కల్మషమయిన స్వార్ధమైన, మాలిన్యమయిన ప్రేమలో విద్యార్థులు యీనాడు మునిగి తమ పవిత్రమయిన జీవితాన్ని ఆదర్శమయిన జీవితాన్ని అమృతమయమయిన జీవితాన్ని, అమరత్వమయిన జీవితాన్ని కేవలం పశుత్వముగా మార్చుకుంటున్నారు.

విద్యార్థులారా ! ఈ ప్రేమతత్త్వాన్ని కొంచెం విచారణ చెయ్యాలి. దైవ ప్రేమయే ప్రేమ కాని లోక ప్రేమ ప్రేమలు కావు. దానిని ప్రేమగా విశ్వసించి మీ పవిత్రమయిన జీవితాలను కల్మషము గావించుకుంటున్నారు. ఆనాటి గోపికలు కూడా భగవంతుని యందు ఆ ప్రేమతత్త్వాన్ని యిమిడ్చి స్వార్ధము స్వప్రయోజనము త్యజించి సర్వము కృష్ణునిగనే విశ్వసించి ఆరాధించుతూవచ్చారు.

ప్రేమ రహిత మరు భూములలో
ప్రేమాంకురములు పెంపొంద
ప్రేమావేశముతో ప్రేమసుధా
వర్షము వర్షింప

ప్రేమ నదులు ప్రవహింపగ
మురళీగానము చేయగదె
కృష్ణా గానముచేయగదె !

ఈమనస్సనే గోపికలందరు యా కృష్ణుని మురళీనాద మనే ప్రజ్ఞలో మునిగిపోయారు. కనుక ప్రజ్ఞానం బ్రహ్మ అందరి యందున్న ప్రజ్ఞయే ప్రేమ. ఈ ప్రేమనే మనము ఈనాడు మేల్కొలపాలి. దీనినే ఉపనిషత్తులు కూడను 'ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్ని బోధత' సర్వమూ భగవంతుడే.

మాతానాస్తి పితానాస్తి
నాస్తి బంధు సహోదరః
అర్థం నాస్తి గృహం నాస్తి
తస్మాత్ జాగ్రత జాగ్రత
జన్మ దుఃఖమ్ జరా దుఃఖమ్
జయాదుఃఖమ్ పునః పునః
అంత్యకాలే మహాదుఃఖమ్
తస్మాత్ జాగ్రత జాగ్రత !

పుట్టిన దేహమే గిట్టుతుంది గానీ పుట్టనటువంటి ప్రేమ గిట్టుట లేదు. అమృత స్వరూపము ప్రేమ అమృతము కంటే అతీతమైనది.

మానవుడు చతుర్విధములైనటువంటి పురుషార్థము లలో వుంటున్నాడు. ధర్మ అర్థ కామ మోక్షములు నాలుగే కానీ ఐదవ పురుషార్థము కూడా ఒకటున్నది. అదే పరాభక్తి. అదే ప్రేమతత్త్వము. ఈ ధర్మార్థ కామ మోక్ష మార్గములు నాలుగు ప్రాకృతమైన ధర్మములు, మార్గములు. ఈ పరాత్పరమైన ప్రేమ తత్త్వము. ఒక్కటి మాత్రమే దివ్యమైన ప్రేమ. ఇదే కైవల్య ప్రేమ. ఇలాంటి తత్త్వాన్ని మనము అర్థం చేసుకోవాలి.

దేహంపైన ప్రేమ, మనసుపైన ప్రేమ, బుద్ధిపైన ప్రేమ, అంతఃకరణపైన ప్రేమ యీ ప్రేమలన్నీ ఏమైపోతున్నాయి. దేహంపైన ప్రేమ దేహం మరణిస్తున్నది. ఆ ప్రేమ కూడా మరణిస్తున్నది. మనస్సుపైన ప్రేమ. సంకల్ప వికల్పాలతో బంధింప బడుతూవుంటున్నది. ఈ ప్రేమ కూడా యిక్కడ బంధింపబడుతూన్నది. బుద్ధిపై ప్రేమ. విచారణపై తికమకలౌతూవుంటుంది. కనుక మన ప్రేమ కూడను అయోమయ స్థితిని పొందుతున్నది. అంతఃకరణప్రేమ విభాగమును పొందుతున్నది. అనగా ద్వైతమవు తున్నది. ఈ ద్వైతముతో కూడిన ప్రేమ ఏమవుతున్నది? అర్థం గుడ్డిదైపోతున్నది. మనము అంతఃకరణను అనుసరించిన వారమగుటచేత అర్థము గుడ్డివారమై పోతున్నాము. కానీ ఆత్మనే నేననుకొన్న వారికి అది అఖండంగా మారిపోతుంది. అమరత్వముగా మారి పోతుంది. అద్వైతానందముగా మారిపోతుంది. అదే నిత్యానందం, పరమ సుఖదం కనుక దేహమే నేననుకున్నవాడు మరణిస్తున్నాడు. మనసే నేననుకున్న వాడు సంకల్ప వికల్పములలో మునిగిపోతున్నాడు. బుద్ధియే నేననుకున్నవాడు విచారణలో మునిగి తికమక లవుతున్నాడు. అంతఃకరణయే నేననుకున్నవాడు అయోమయ స్థితిలో మునుగుతున్నాడు. ఆత్మనే నేనను కున్నవాడు పరమాత్మను పొందుతున్నాడు కనుక యీనాడు దేహభ్రాంతి, మనోభ్రాంతి, బుద్ధిభ్రాంతి ఇవి కేవలము ప్రాకృతికమైన కసరత్తులే.

ఏమిటి ఈ విద్యల యొక్క పరిణామము ? ప్రమా ణము. ఎంతో చదువులు చదువుతున్నారుగానీ విచారణ యందు వీరు శూన్యులైపోతున్నారు. ప్రతి మానవుడు కూడ ప్రతిక్షణం కూడను దానికి Question వేసుకుంటూ రావాలి. ఇదే విచారణ. దీనినే వేదాంత పరిభాషలో మీమాంస అంటారు పాలు వున్నాయి. ఈ పాలు తోడు వేసి పెరుగుగా మార్చుకున్నాము. ఈ పెరుగు చిలికి వెన్న తీసాము. ఈ వెన్నను కరిగించి నేయి తీసాము. ఆ నెయ్యిని భుజించటమే కాబట్టి పాల యొక్క సత్యము ఏమిటి ? నెయ్యి. ఇదియే ఒక మీమాంస. ప్రతి

పదార్థమును బోధిస్తూ కట్టకడపటికి విశ్వకర్మయే సత్యము. అదే విధముగనే మనము విచారణ చేయాలి.

నా దేహము, నా చిత్తము, నా యింద్రియములు, నా అంతఃకరణ కానీ నేను ఎవరు ? యిది question వేసుకోవాలి. This is my body, I am not the body. This is my mind, I am not the mind ఎట్లా ? ఇది నా కర్చీఫ్. యిది నా నుండి దూరమై పోయింది. కర్చీఫ్ నేను కాదు. అదే రీతిగ my body means body is different from me. తెల్లవారి లేచినది మొదలు రాత్రి పరుండునంతవరకు నా యిల్లు, నా పుస్తకము, నా shirt అంతా నా-నా. ఈ నాకు యింకొక అర్థము తీసుకోవాలి. నా అనగా కాదు అని అర్థము. నా దేహము. దేహము నేను కాదు. నా మనసు. మనసు నేను కాదు. దీనినే వేదాంతము నందు నేతి, నేతి not this, not this అంటూవచ్చారు. కనుక లౌకికమైన జీవితములో మనము అనుభవించే ప్రేమలు కానే కాదు. పేరు పెట్టుకుంటున్నారేగానీ, పేరు పెట్టుకున్నంతమాత్రమున స్వస్వరూపాన్ని ధరించగలరా ? కనుకనే చెప్పారు. పేరు ధర్మరాజు పెనువేపవిత్తుండు పేరేమో ధర్మరాజు. అతనిమనసేమో వేప విత్తనంలాగ చేదుగా వుంటుంది. పేరు త్యాగరాజు కానీ త్యాగమనేటటువంటిది ఏ కోణానా లేదు అంతా భోగమే. పేరు పెట్టినంతమాత్రమున సార్ధకమవుతుందా ! పేరుకు తగినటువంటి సార్ధకత మనం సంపాదించాలి.

మా-న-వ అనే పేరుకు తగినటువంటి సార్థకత మనం సంపాదించాలి. మ- అజ్ఞానము న- లేకుండా వ- వర్తించుట. అజ్ఞానము లేకుండా వర్తించటము. వాడే మానవుడు. ఆ మానవుడు నిన్న మొన్న పుట్టిన వాడా ? కాదు! కాదు! అనేక జన్మల నుండి వచ్చే పాత వాడే. కొత్తవాడు కాదు ఏ విధంగా చెప్పగలము. ఆ పదమునందే వున్నది కొత్తవాడు కాదని. మా-కాదు. నవ-కొత్త. కొత్తవాడు కాదు మానవుడు ప్రాచీనుడే ఇలాంటి అర్థాలను మనం వేదాంతములో చక్కగా విచారించినప్పుడు మానవత్వం ఎంత దివ్యత్వాన్ని పొందుతుంది! ఎంత ఆనందాన్ని పొందుతుంది!

ప్రేమస్వరూపులారా! ప్రేమతత్వాన్ని మనం అభివృద్ధిగావించుకోవాలి ఈనాటి ప్రపంచమంతయు కూడా అనేక విధములైన దుఃఖములతో, కష్టములతో, విచారములతో, భయముతో భ్రాంతితో ఉడికిపోతున్నది. శాంతి భద్రతలకు తావులేదు. ఇంటిలో వున్నా భయమే. వీధిలోకి పోయినా భయమే. బస్సు ఎక్కినా భయమే, రిక్షా ఎక్కినా భయమే, ట్రైన్ ఎక్కినా భయమే, ఏమి చేసినా భయమే. ఇంక యీ జీవితం ఏ రీతిగా గడుపుతాము. అంతా భయం, భయం.

భయం భయం బ్రతుకు భయం
భయం భయం బ్రతుకు భయం అన్నా
మనకీలోకం పన్నిన పద్మవ్యూహం
గతి లేని మానవులకు చితికిన సంసారాలకు
కష్టాలే బంధువులా ? కన్నీళ్లే కానుకలా ?
భయం భయం బ్రతుకు భయం.

ఈ జీవితమంతా భయంతోనే నిండిపోతున్నది. ఈ భయాన్ని మనం పోగొట్టుకోవాలంటే అభయత్వాన్ని మనం పొందాలి యీ అభయత్వం మనకి ఎప్పుడు చిక్కుతుంది ? మనం త్యాగముతోనే అభయత్వమును పొందవచ్చు. వాంఛలుండినంతవరకు మనకు భయమే. ఏనాడు మనం త్యాగానికి పూనుకుంటామో అప్పుడు భయమే ఉండదు.

సాధ్యమైనంతవరకు ఆధునిక యుగమునందు నాగరికత అనే దానిని అర్థము చేసుకోవాలి. నాగరికత అంటే ఏమిటి ? కోరికలు పెంచుకోటమా ? పెద్దలను ధిక్కరించడమా నాగరికత ? ధర్మవిరుద్ధముగా ప్రవర్తించటమా నాగరికత ? నీతి నియమాలను వదలటమా నాగరికత ? కాదు ... కాదు కేవలము కోర్కెలను త్రుంచుకొని, మితమైన జీవితంలో, హితమైన భాషతో సన్నిహిత తత్వాన్ని మనం పొందాలి.

ఇది సరియైన నాగరికత. మనలో కోర్కెలను తగ్గించుకోవాలి. చాలామంది పిల్లలంతా Train ప్రయాణం చేసివుంటారు. ఆ Trainపై వుంటుంది Less Luggage more comfort make travel a pleasure వీటిని తగ్గించుకుంటూరండి. మన ప్రయాణం దీర్ఘ ప్రయాణం. దీనిలో Luggage. వీటిని తగ్గించుకుంటూ రండి. ఏనాడు వీటిని తగ్గించుకుందుమో ఆనాడు Light గా ఆనందముగా మన జీవితము గడపవచ్చు జీవితానికి వుండవలసిన కోరికలు కొన్ని వుండవలసిందే. మనం మితిమీరి కోరకూడదు. ఇది యీనాటి విద్యార్థులు నేర్చుకుంటే మీరు భావిభారతోద్ధారకులుగా వున్నప్పుడు దేశాన్ని ఎంతవరకైనను చక్కదిద్దగలరు.

భావి భారతోద్ధారకులైన విద్యార్థులారా! మీలో నున్నటువంటి నీతి నిజాయితీలను అభివృద్ధి పరచుకోండి మన విద్య యొక్క తత్త్వము వినయ విధేయతలు చూపించాలి. తల్లిదండ్రులను గౌరవించాలి. పెద్దలను గౌరవించాలి. భగవంతుని ప్రేమించాలి. ఇదియే నిజమైన విద్య.

ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు ప్రశ్నించాడు! నాయనా! ఏ విద్యలు చదివావో ఒక్కతూరి ఉచ్చరించమన్నాడు.

చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థ ముఖ్య శాస్త్రంబులన్
చదివినవి కలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!

అన్నాడు ఆనందించాడు హిరణ్యకశిపుడు నాయనా! ఆ రహస్యమేమిటో చెప్పమన్నాడు. 'ఓం నమో నారాయణాయ' అన్నాడు. మండిపడ్డాడు హిరణ్యకశిపుడు "ఏమిరా యిదా చదువులో రహస్యం" "యిదే నాన్నా! యింతకంటే మరొక రహస్యం లేదు! ఈ ధర్మార్థ కామములు మానవుని బంధిస్తున్నవే. గానీ బంధవిమోచనకు మార్గమే లేదు. పుట్టినవాడు "ఎచ్చట పుట్టెనో నచ్చటి కేగుటయే ప్రాణికోటికిన్! ఎక్కడ నుండి వచ్చామో అక్కడికి పోయి చేరాలి. ఆ పోవటానికి యిదొక్కటే మార్గమన్నారు. ఈ ప్రేమ ఎక్కడ పుట్టింది? సచ్చిదానంద సాగరమును చిలికినప్పుడు యిది ఆవిర్భవించింది కనుక సచ్చిదానందమే ప్రేమకు జన్మస్థానము. ఏమిటి? యీ సచ్చిదానందము. సత్యమనగా త్రికాలబాధ్యము. మార్పులేనిది చిత్ అనగా పరిపూర్ణ జ్ఞానము. ఈ సత్యము, పరిపూర్ణ జ్ఞానము ఎక్కడ వుంటుందో అక్కడే ఆనందము. దీనిని పొందాలంటే అర్థముకాని వేదాంతాలను మీరు అనుసరించకండి. సులభమైన మార్గము, రాజబాట. ఏమిటది? సత్యమును పొందాలనుకుంటే సత్యముతోనే సత్యమును పొందాలి. ఇంక చిత్ ప్రజ్ఞానములోనే చిత్‌ను పొందాలి ఆనందమును ఆనందముతోనే పొందాలి వేరొక మార్గములేదు ప్రకాశించే చంద్రుని చూడాలనుకుంటున్నప్పుడు టార్చిలైట్, హరికేన్ లైటో, పెట్రోమాక్స్‌లైటో మనకు అక్కర లేదు. చంద్రుని వెలుతురు ఆధారంగానే చంద్రుని చూడాలి.

సత్యస్వరూపుని సత్యంతోనే చూడండి. ధర్మస్వరూపుని ధర్మంతోనే చూడండి ప్రేమ స్వరూపుని ప్రేమతో చూడండి. ఆనందస్వరూపుని ఆనందముతో చూడండి ఈనాడు మనము సత్యము, ధర్మము, ప్రేమ ఆనందము మనలో ఆవిర్భవింపచేసుకోవాలి ఇవియే ప్రేమయొక్క ప్రతిబింబాలు. దీనిని చక్కగా అర్థం చేసుకొంటే లౌకికంగా నిత్యము మనము అనుభవించే ప్రేమకు ఈ దివ్యమైన ప్రేమకు ఎంత వ్యత్యాసమో మీరు గుర్తించటానికి వీలవుతుంది

కనుక ప్రేమతత్త్వాన్ని మీరు గుర్తించండి అప్పుడే మీరు ప్రేమస్వరూపులుగా మారుతారు. మానవుని యందున్న రాగద్వేష, అసూయ, ఆడంబరములను రోగములుగా భావించండి. యీ భవరోగాలకు సరియైన మందు దైవప్రేమయే కనుక ప్రేమమయులు కండి!

(బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో ది 30-5-92 న భగవాన్ బాబావారి దివ్య ప్రసంగం)

( ౮ వ పేజీ తరువాయి )

భక్తులు "స్వామియే శరణం అయ్యప్ప" అనెడి నామమును పదేపదే పలుకుచూ హృదయములో అయ్యప్పమూర్తిని దర్శించుచూ ముందునకేగుదురు బాట దుర్గమమైనపుడు భగవన్నామమును శ్రద్ధతో పలుకవలెను. వెంటనే దుర్గమమైన బాట సుగమమగును భక్తులు 'కరిమలై' ని అధిగమించగనే అధికోత్సాహముతో ఆనందించుదురు. భగవత్ప్రాప్తినొందుటకై మనము కఠోర సాధనలాచరించుదుము తత్ఫలితముగ కమనీయస్థితిని బొంది తరింతుము.

కరిమలైని దాటగానే భక్తులు పూర్ణానది తీరమును చేరుదురు. అచ్చట స్నానమాచరించుదురు ఈదశలో సాధకుడు తనలోని అపరిపూర్ణ స్థితిని విడనాడి పూర్ణత్వముతో శుద్ధిపడును. ఇదియే నిత్యానంద స్థితి. సవికల్ప సమాధి

అది జరిగినతరువాత భక్తులు "నీలిమలై" చేరుదురు ఈ కొండమీదనే శబరిమలై ఆలయము నిర్మింపబడియున్నది. ఈ నీలిమలైవద్ద శిథిలమైన అశ్వత్థ వృక్షము గోచరించును. ఈ వృక్షముయొక్క స్థానమును "శరంకుత్తిఆల్" అందురు. అనగా "శరము విడిచిన చెట్టు" అని భావము. "ఏరుమేలి" వద్ద సాధకుడు కొని, చేతపట్టుకొనిన బాణమును ఈ అశ్వత్థ వృక్షము చెంత విడిచిపెట్టును.

బాణము విడువబడిన తరువాత లక్ష్యస్థానమును చేరుతుంది. సాధారణముగా మనకు లక్ష్యస్థానము ప్రేయస్సేగాని శ్రేయస్సు కాదు కనుక ఆధ్యాత్మిక సాధకుడు కూడా దారి తప్పినవాడై ప్రేయస్సునే లక్ష్యముగా ఎన్నుకొనును, ప్రేయస్సును సాధించే ప్రయత్నములో తాను జీవనయాత్రను సాగించును. నీలిమలైకి చేరినతరువాత తనకు కావలసింది శ్రేయస్సేగాని ప్రేయస్సు కాదని గుర్తించి ఎరుమేలివద్ద గ్రహించిన శరమును అశ్వత్థ వృక్షముచెంత వదిలిపెట్టును. అశ్వత్థమనగా స్థిరత్వములేని సంసారమని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో పదునైదవ అధ్యాయమునందు తెలియజేయును కనుక ఈ ప్రపంచము అనిత్యమని గ్రహించిన సాధకుడు నీలిమలై వద్ద ప్రేయస్సును పరిత్యజించి. తన లక్ష్యస్థానము శ్రేయస్సేనని గ్రహించి ముందునకు సాగిపోవును ఇదియే ఆధ్యాత్మిక ప్రయాణములోని చివరి మజిలీ. ఇచ్చటనుండి భక్తులు అయ్యప్ప ఆలయమును చేరి, అక్కడనుండి అష్టాదశ సోపానముల నెక్కి స్వామిని దర్శింతురు.

స్వామి ఆలయమును చేరుటకు పదునెనిమిది మెట్లు ఎక్కవలెను సనాతన ధర్మమార్గములో పదునెనిమిది సంఖ్యకు ఎంతో ప్రాశస్త్యమున్నది. సామాన్య జనులకు సైతము ఆధ్యాత్మిక జ్ఞానము నందించవలెనని అభిప్రాయపడి పురాణములను వేదవ్యాసుడు రచించెను. అట్టి పురాణములు పదునెనిమిది కావడము గమనించదగిన విషయము. పంచమవేదమైన భారతమునందు పర్వములు పదునెనిమిదియై ఉండి భారతయుద్ధము పదునెనిమిది రోజులు జరిగెను. కురుక్షేత్రమునందు పదునెనిమిది అక్షౌహిణుల సైన్యము నిలిచియుండెను. యుద్ధానంతరము పదునెనిమిదిమంది మాత్రమే మిగిలిరి. కురుక్షేత్రమునందు శ్రీకృష్ణుడు బోధించిన భగవద్గీతనందు పదునెనిమిది అధ్యాయములుండ, జ్ఞాని స్థితిని అపూర్వముగా నిర్వచించిన స్థితప్రజ్ఞ లక్షణములు పదునెనిమిది శ్లోకములయందు నింపబడెను. ఉపనిషత్తులలోని ప్రథమ ఉపనిషత్తైన ఈశావాస్యమునందును, ఆద్యపురుషుని గూర్చి నాల్గు వేదములందును గానం చేయబడిన పురుషసూక్తమునందును పదునెనిమిది మంత్రములు ఉండెను దేవికి హస్తాలు పదునెనిమిది కాగా, దేవాలయపు మెట్లు పదునెనిమిది అయ్యెను. దీనిని బట్టి చూసిన హిందూధర్మశాస్త్రమునందు పదునెనిమిది యను సంఖ్యకు విశిష్టస్థానమున్నదని తెలియుచున్నది. మానవుడు మాధవుడయ్యేందుకు చేయు ప్రయత్నములో పదునెనిమిది సోపానములను దాటవలెనని తెలుపుటయే ఇందులోని అంతర్భావము.

స్వామి అయ్యప్ప ఆలయానికి పదునెనిమిది మెట్లు ఉండుటలోని కూడా అంతరార్థమిదియే

ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు ప్రాణములు, మనస్సు, బుద్ధి అనెడి పదునేడు విషయములచేత మానవునికి స్థూల సూక్ష్మ శరీరములు ఏర్పడినవి. పదునెనిమిదవ సోపానము కారణ శరీరమై ఉన్నది అదియే అజ్ఞానము. ఈ పదునెనిమిది మెట్లు దాటినపుడే మనము చైతన్య జీవనము ననుభవించ గలము ఈ పదునెనిమిది వేఱువేఱుగా లేవు. ఇవి అన్నియు ఒకే మాయా స్వరూపమై ఉన్నందున పరస్పరము ముడిపడియున్నవి. అయ్యప్ప ఆలయానికి అమర్చబడిన పదునెనిమిది మెట్లు ఒకే జాతితో ఉండుటలోని అంతరార్థము కూడా ఇదియే

పదునెనిమిది మెట్లును ఎక్కిన తరువాత భక్తులు అయ్యప్పను దర్శింతురు మాయను దాటిన వారికి మాధవుని దర్శనము ప్రాప్తించును. " ఇరుముడి "ని ఇప్పుడు తలమీద నుంచి దించి, అందులోని కొబ్బరి కాయను పగులగొట్టి, అందులో నింపబడియున్న ఘృత ముచే అయ్యప్పను అభిషేకించి, పగిలిన రెండు కొబ్బరి ముక్కలను ఆ ప్రక్కనే వెలుగుతున్న హవనకుండము నందు పడవేయుదురు. అలా అగ్నిలో పడిన కొబ్బరి ముక్కలు చూచుచుండగనే దగ్ధమైపోవును.

కొబ్బరికాయలో ఘృతము నిండియున్నట్లు మనలో సంచిత కర్మనుంతయు నిండియున్నది. సంచితమును స్వామికి సమర్పించగనే మన పుణ్య పాపములన్నియు అదృశ్యమగును. పుణ్యపాపములు లేనపుడు, వాటిని అనుభవించు క్షేత్రముయొక్క అవసరమేమున్నది ? అందుచేత కొబ్బరిచిప్పలు హవనకుండమునందు దగ్ధమై నట్లు మానవ దేహము కాష్ఠములో కాలి బూడిదై పోతుంది

ఈ సత్యమును దర్శించి పరవశించు భక్తులు తమ వద్దనున్న అగరుబత్తులను అయ్యప్పముందు వెలిగించి, వాసనాక్షయమొనర్చుకొందురు. తాము కొనితెచ్చిన కర్పూరమును నీరాజనముగా నిరంజనునికి సమర్పించి, ఏమీ మిగలకుండా భగవానునిలో ఐక్యమగుదురు. ఇదియే అయ్యప్ప యాత్ర ద్వారా భక్తులు పొందవలసిన దివ్యానుభూతి

అభిషేక నీరాజనములను పూర్తిచేసుకొని, చేతులు జోడించి నమస్కరించుచు, హృదయ స్పందనతో ఆనందాశ్రువులను రాల్చుచున్న భక్తసమూహమునకు అయ్యప్పస్వామి చిన్ముద్రను చూపుచు దర్శన మొసంగును. జీవుడనెడి చూపుడువేలు బ్రహ్మయనెడి బొటనవేలుతో కలిసియుండ మిగిలిన మూడువేళ్లు అనెడి అవస్థాత్రయము దూరముగా నిలిచియుండుటయే చిన్ముద్రలోని అంతర్భావము ఆధ్యాత్మిక సాధకుడు ఆచరించి తరించుటకు అనువుగా ఏర్పడిన ఈ అయ్యప్ప యాత్రలోని విశిష్టాంశములను గ్రహించినాము. కానీ ఇచ్చట ఒక్క విన్నపమును చేయకుండా వ్యాసమును ముగించినచో హితకరమగు ఈ ప్రయత్నము హానికర ముగా పరిణమించినను అతిశయోక్తి కాదని భావించి కొన్ని చేదు నిజాలను చెప్పించుటకు నేను వెనుకాడుట లేదు.

భక్తులారా ! వ్యవస్థ ఎక్కువగా కదిలే సమయాన వ్యసనం చోటుచేసుకొనే ప్రమాదం వుంటుంది. వ్యసనాన్ని తొలగించుకుంటూ వ్యవస్థవైపు నడక సాగించినపుడే సమాజానికి స్థిరత, జనానికి సుస్థిరత చేకూరుతాయి

చరిత్రను చక్కగా పరిశీలించి, విశ్లేషించి అవగత మొనర్చుకొనినచో ఎన్నో సాంప్రదాయాలు గతంలో కదిలాయి. కదిలినట్లే కదిలి కనుమరుగయ్యాయి ఆధ్యాత్మిక సాధన ఏదైనను ప్రారంభమునందు విశిష్ట ముగనే గోచరిస్తుంది దినములు గడచి జనములు పెరిగి మననము లోపించినపుడు, దిక్కులు పిక్కటిల్లేలా ఎదిగిన ఉద్యమాలు దిక్కులేనివియై చిక్కులలో పడిపో తాయి సనాతన ధర్మమార్గమున చరించువారెవ్వరూ మూఢవిశ్వాసాలకు బానిసలు కారాదు.

"అయ్యప్ప యాత్ర" ఇటీవల కాలంలో చాలా అద్భుతంగా, అనూహ్యంగా అభివృద్ధిచెందింది. చాలా సంతోషకరమైన విషయం అయితే దీని ప్రభావము ఎలా ఉంటుంది! ఎలా ఉండాలి? అని ఆలోచించినపుడు పూర్వాపరాలను దృష్టిలో నుంచుకొని ఈ వ్యాసావళిని అందించవలసివచ్చింది.

ఆధ్యాత్మిక అవగాహనతో ఏర్పడిన ఈ అయ్యప్ప యాత్ర సాధకులకు చక్కని సోపానములను అమర్చి పెడుతుందని నిస్సందేహముగా నేను అభిప్రాయ పడుతున్నాను. కానీ ఈ యాత్రను చేపట్టే భక్తులను పరిశీలించినపుడు అధిక సంఖ్యాకులు అయోమయంగా చరించడము చూసినపుడు మనస్సు కలత చెందుతున్నది.

విజ్ఞాన భూమికలను అందించుటకు అనువైన ఈ యాత్ర విహారయాత్రగా మారడం సోచనీయం నల్లని దుస్తులను ధరించి, ఎఱ్ఱని సిగరెట్టు పీకను నోటియందు ఉంచుకొని, కొరివిదయ్యాలలాగా, చీకటిలో భజన కెళ్తున్న ఉల్లాసీదా భక్తులను కొందరిని చూసినపుడు నిజమైన భక్తులకు హృదయము కలతచెందకపోదు.

చేసిన తప్పులను కప్పిపుచ్చుకొనేందుకు ఇది ఏకైక మార్గమని కొందరు భావిస్తే, వేష భాషల విన్యాసాలకు విలువిచ్చి వినోదము నొందుటకు కొందరు చరిస్తే, సమాజములో పేరు ప్రతిష్ఠలను పెంచుకొనేందుకు మరికొందరు సంచరిస్తుంటే - ఈ దుర్బలులను గాంచి నిజ భక్తితో అయ్యప్ప యాత్రలు సాగించే భక్తులు కలతచెందడం కూడా నేను చూసినాను

మిధ్యాచార వ్యవహారాలు కొనసాగడంవల్ల వ్యక్తికి వినాశనమే గాక సమిష్ఠికి కూడా నష్టమే వాటిల్లును ఆధ్యాత్మిక వ్యవహారాలు ఎప్పుడూ లౌకికపరం కాకూడదు మూఢ విశ్వాసాలకు లోనైన సాంప్రదాయాలు శాశ్వతంగా నిలవవు

భక్తులు ఈ సత్యమును మనసునందుంచుకొని పవిత్రమైన అయ్యప్ప యాత్ర ద్వారా పునీతులై తరించెదరని ఆశిస్తున్నాను దారి తప్పి నడక సాగించే సంస్కారహీనులను దారిలో ఉంచడము కూడా పుణ్య కార్యమేనని సవినంగా మనవి చేయుచున్నాను.

స్వామియే శరణం అయ్యప్ప !

శ్రీవాణి ని అభిమానంతో ఆదరిస్తున్న పాఠకులకు ఒక చిన్న మనవి. ఈనాటి పరిస్థితులలో శ్రీవాణి లాంటి ఉత్తమ ఆశయ ఆదర్శములు గల పత్రికను నడపటం చాలా కష్టం. అయినప్పటికీ పాఠకుల ప్రోత్సాహంతో గత ఎనిమిది సంవత్సరాలుగా పత్రికను ప్రతినెలా సకాలంలో అందించగలుగుతున్నాను. ఏప్రియల్ '93 లో శతసంచిక మహోత్సవం జరుగపతున్న తరుణంలో ప్రతి శ్రీవాణి పాఠకుడు కనీసం ఒక క్రొత్త చందాను చేర్పించి పంపి శ్రీవాణి సర్క్యులేషన్ పెంచే ప్రయత్నంలో భాగస్వాములవుతారని ఆశిస్తున్నాను.

భగవాన్ బాబాగారి జన్మదినోత్సవ ప్రత్యేక సంచికలు (నవంబర్ '92) అయిపోయినాయి. లామినేషన్ చేయించిన ప్రత్యేక సంచికలు (నవంబర్ '92) మాత్రం కొద్దిగా ఉన్నాయి. రు 10/= లు పంపినవారికి మాత్రం లామినేషన్ ప్రతి పంపబడును. త్వరపడండి ! క్రొత్త చందాదారులకు జనవరి '93 సంచిక నుండి శ్రీవాణి పంపబడును. రు 58/=లు పంపినవారికి నవంబర్ '92 లామినేషన్ ప్రత్యేక సంచిక కూడా పంపబడును. గమనించ ప్రార్థన. - సం.

నాణ్యతకు ! సరసమైన ధరలకు !

# లక్ష్మీ జనరల్ స్టోర్సు

గవర్నరుపేట, విజయవాడ - 520 002

గ్యారంటీ వెండి జరీ కంచి, ఆరణి, ధర్మవరం చీరలకు

టెస్టెడ్ జరీ, బెంగుళూరు, బెనారస్ పట్టు చీరలకు

మరియు

టెరీన్ సూటింగులు, షర్టింగులకు

మా ప్రత్యేకత

చేనేత చీరెలు, ధోవతులు, లుంగీలు, టవల్సు

బెడ్‌షీట్సు, దుప్పట్లు సరసమైన ధరలకు లభించును.

దర్శించండి ! కొనండి ! ఆనందించండి !